శ్రీరస్తు

# శ్రీ భగవద్గీతా మంజరి

శ్రీ రాజా పానగంటి పార్థసారథి రాయనింగారు, బి. ఏ.,
రాజా ఆఫ్ పానగల్‌చే

విరచితము

రెండవ కూర్పు

చెన్నపురి

౧౯౪౪

క. అన్నియుఁ దానై తానై
యున్నిట నన్నిటికిఁ దానె ♦ యాదటవై తా
నన్నిట రేఁడై యెన్నఁడు
నున్నట్టి మఱొండు లేని ♦ యొక్కని దలఁతున్.

క. తలిదండ్రు లచ్చమాంబకు
నలవేంకటరంగ నృపతి ♦ కౌచలసతులౌ
జెలుపుమ భగవద్గీతల్
దెలుఁగున రచియింప బూని ♦ తిఁకా బితృసేవన్.

శ్రీ ర స్తు

# శ్రీ భగవద్గీతా మంజరి

## మొదటి అధ్యాయము

### అర్జునవిషాదయోగము

ధృతరాష్ట్రుఁడు పల్కె.

ధర్మభూమిని కురుక్షేత్రంబునందు
డీకొనఁ గోరి కూడిన పాండవులును
నావారు నేమి సంజయ, సల్పినారు ౧

సంజయుఁడు పల్కె.

వ్యూహంబు గాఁగను బొనరింపఁగఁబడి
నిల్చిన పాండవానీకముం గాంచి
యనె సుయోధనుఁడు రాజపుడు డాసి గురు ౨

దుర్యోధనుండు పల్కె.

బుద్ధిశాలి ద్రుపదపుత్త్రుండు నీదు
శిష్యుండు తీర్పఁగాఁ జేరిన దీనిఁ
బాండుపుత్త్రుల పెనుబాజుఁ గన్గొమ్మొజ్జ ౩
ఆలంబునందు భీమార్జునులకును
సములు బల్ విలుకాండ్రిచటి మేటిమగలు,
పురజిత్తు మఱి కుంతిభోజుండు, మగల
తలకట్టు శైబ్యుండు, ద్రౌపదేయులును,
వీర్యవంతుఁడు కాశివిభుఁడు, సుభద్ర

తనయుండు, మఱి చేకి♦తానుండు, మఱియు
యుయుధానుఁడును, వీరుఁ ♦ డుత్తమౌజుండు,
బలి యుధామన్యుండు, ♦ బల్ తేజివాఁడు
ద్రుపదుండు, ధృష్టకే♦తుఁడు, విరాటుండు,
నందఱుగూడ మ♦హారథుల్ వారు ౪, ౫, ౬
మఱి ద్విజోత్తమ, నాదు, ♦ [1]మందులయొక్క
గమికాండ్రు మనవారు ♦ ఘనవీరు లెవరొ
వారి నెఱుఁగు, నీకుఁ ♦ బలికెదఁ దెలియ ౭
నీవు వికర్ణుఁడుఁ ♦ గృపుఁడు కర్ణుండు
సమితింజయుండును ♦ సౌమదత్తియును
ద్రోణియు, మఱి జయ♦ద్రథుఁడు భీష్ముండు ౮
పెక్కండ్రు పెరవారు ♦ వీరంపుమగలు,
జీవముల్ నాకై త్య♦జించినవారు,
బహువిధంబుల శస్త్ర♦పరికరంబులను
గొన్నవార్ భండన ♦ కోవిదు లెల్ల ౯
అల్లదె మనది, భీ♦ష్మాభిరక్షితము
బల, మపర్యాప్తంబు, ♦ వారల బలము
పర్యాప్త మిదెభీమ♦పరిరక్షితంబు ౧౦
మొనలనెల్లఁ దమతా♦వులను మీరెల్ల
నిలుచుండి కావఁగా ♦ న్భీష్మునేవలయు ౧౧

సంజయుఁడుపల్కె

వానికి హర్షంబు ♦ ప్రభవింపఁగాను
సింహనాదము పెల్లు♦చేసి వీరుండు

1. మందులు = సేనలు

కురువృద్ధుఁ డొత్తె సం♦కును బితామహుఁడు ౧౨
వెసనె గోముఖశంఖ ♦ భేరులు మఱియు
నానక పణవంబు ♦ [1]అలికిడిసేయ
నద్యోను దుములంబు ♦ నాశబ్దమంత ౧౩
తెల్లగుఱ్ఱాల పె♦న్దేరునందున్న
పాండవుండును నంత ♦ వాసుదేవుండు
దివ్యశంఖముల నొ♦త్తిరి, హరి యొత్తెఁ
బాంచజన్యంబును, ♦ బౌండ్రంబు నొత్తెఁ
బెనుసంకు భీముండు ♦ భీమకర్ముండు,
దేవదత్తంబు నొ♦త్తె ధనంజయుండు,
సహదేవుఁడు మణిపు♦ష్పకము శబ్దించెఁ,
బూరించెను సుఘోష♦మును నకులుండు,
నృపతి కుంతీజుఁడ♦యిన యుధిష్ఠిరుఁడు,
నలికిడిసేసె న♦నంత విజయము,
ఘనకార్ముకుండైన ♦ కాశ్యుండు మఱియు
నపరాజితుండు సా♦త్యకి మహారథుఁడు
నైన శిఖండి మ♦హాబాహుఁడైన
సౌభద్రుఁడు మఱి ధృ♦ష్టద్యుమ్నుఁడు మఱి
ద్రోవది తనయులు ♦ ద్రుపదుండు మఱియు
నృపతి! విరాటుండు ♦ నెల్ల ప్రక్కలను
నొత్తిరి శంఖంబు ♦ లొక్కొక్కఁడుగను ౧౮
భూనభంబులు నిండ ♦ మ్రోఁగి యా ఘోష
నురిగించె ధార్తరా♦ష్ట్రుల డెందములను ౧౯

---

1. అలికిడి = శబ్దము.

హతశేష శస్త్రముల్ ♦ కురియ నుండంగఁ
గపికేత నుండైన ♦ కౌంతేయుఁ డంతఁ
దీరి నిల్చిన యట్టి ♦ ధృతరాష్ట్రు సేన
నీక్షించి ధనువెత్తి ♦ యీ పల్కు లనియెఁ
గృష్ణునితోడ, "నో♦కృష్ణ నాతేరు
నుభయసేనల మధ్య ♦ నుండఁగా నిల్పు ౨౦, ౨౧
ఈ యుద్ధయత్నమం ♦ దెవరితో నేను
బోరంగ నౌనట్టి, ♦ పోరంగఁ గోరి,
నిలిచియుండెడి వీరి ♦ నేఁజూచు తఱిని ౨౨
దురమున దుర్మతి ♦ దుర్యోధనునకు
హర్షంబు గల్పింప ♦ నాలంబు సల్ప
నిటకు వచ్చిన వీరి ♦ నేను జూచెదను." ౨౩
విజయుండు నిట్టుల ♦ వేఁడఁ గృష్ణుండు,
ద్రోణ భీష్ములు నెల్ల ♦ దొరలకు నెదుట
నుభయసేనల మధ్య ♦ నుంచి బత్తేరు
వచియించె ధాత్రీశ, ♦ "పార్థ! కన్గొనుము
గమికొని యున్న యీ♦కౌరవుల" నని ౨౪, ౨౫
అంతఁ బార్థుఁడు గాంచె♦నట నిల్చియున్న
తాతలన్ సుతుల భ్రా♦తల మాతులులను
మామలన్ దండ్రులన్ ♦ మనుమలన్ సఖుల
నిరుదళంబులను సు♦హృదులను గురుల
శ్వశురులన్ నిల్చిన ♦ బంధులనెల్ల,
నవ్వారి నీక్షించి ♦ యాకుంతికొడుకు,
పరమహా కృపఁజెంది ♦ వగ నిట్లు పల్కె,

అర్జునుఁడు పల్కె

"చివ్వ సల్పఁగఁ గోరి ♦ చేరి యున్నట్టి
వీరిని మావారి ♦ వీక్షించి నాదు
గాత్రముల్ శిథిలమౌఁ ♦ గంపించు నొడలు
ముఖమెండు రోమముల్ ♦ మొనలపై నిక్క
గాండీవ మురియాడుఁ ♦ గరమునఁ గృష్ణ
చర్మంబు మండు న ♦ శక్యమౌ నిలువ
మనసును భ్రమమందు ♦ మాడ్కిఁ దోఁచెడిని
విపరీత సూచనల్ ♦ వీక్షింతుఁ గృష్ణ! ౨౯, ౩౦
స్వజనంబు ననిలోనఁ ♦ జంపి మేల్ గాంచఁ
గోరను విజయంబుఁ ♦ గోర రాజ్యంబుఁ
గోర సుఖముఁ గృష్ణ! ♦ గోవింద! మనకు
రాజ్యంబు భోగముల్ ♦ ప్రాణమేనేల ౩౨
భూమియు సౌఖ్యముల్ ♦ భోగముల్ మనము
వలతు మెవ్వారికై ♦ వారలే యనిని
జేరిరి విత్తముల్ ♦ జీవముల్ విడిచి ౩౩
తండ్రులు బిడ్డలు ♦ తాతలు గురులు
నల్లి మాతులులు వి♦య్యంకులు మఱియు
మామలు బావలు ♦ మనుమలు గూడ ౩౪
త్రైలోక్య రాజ్యంబు ♦ దార్చునప్పటికిఁ
జంప నొల్లను వీరిఁ ♦ జంపఁ బడినను,
నిలకు మాత్రంబేని ♦ నేమి యౌఁ గృష్ణ; ౩౫
ధార్తరాష్ట్రులఁగూల్చి ♦ దైత్యారి మనకు

నేమి ప్రీతి లభించు ♦ నీ పాతకులను
వధియింపఁ బాపంబె ♦ ప్రాపించు మనల ౩౬
గాదిలి వారితోఁ, ♦ గాఁబట్టి, మనకు
ధార్తరాష్ట్రులఁ జంపఁ ♦ దగదు శ్రీకృష్ణ,
సుఖుల మెట్లగుదుము ♦ చుట్టాలఁ గెడపి ౩౭
కులమునాశము చేయఁ ♦ గూడు దోషంబు
మిత్రుల వంచింప ♦ మిగులు పాపంబు
పేరాస మదిచెడ్డ ♦ వీర్ గనరేని ౩౮
కులమునాశముచేయఁ ♦ గూడు దోషంబు
వీక్షించు మనకేల ♦ యీ పాతకంబు
నుండి దొలఁగ నేర♦నోపని దగును ౯౩
కులము పోవ ననాది ♦ కులధర్మములును
నడఁగును, ధర్మంబు ♦ నడఁగుట మఱియుఁ
గులమంతట నలము♦కొను నధర్మంబు ౪౦
దూష్యలు స్త్రీలవు♦దు రధర్మమెచ్చ
నచ్యుతా, దుర్మార్గ ♦ లైనచో స్త్రీలు
వార్ష్ణేయ, వాటిల్లు ♦ వర్ణసంకరము ౪౧
నరకంబె కలుగు సం♦కరమునఁ జేసి
కులమునకును మఱి ♦ కులఘాతుకులకుఁ;
బిండోదకక్రియ ♦ ల్వీడుకొన్నట్టి
వారల పితరులు ♦ పడుదురు కాదె ౪౨
వర్ణసంకరమును ♦ బడయించునట్టి

కులఘాతుకు లవి యా ♦ [1]కొడిమెలవలన
శాశ్వతంబుగ నుండు ♦ జాతిధర్మములుఁ
గులధర్మములుఁ గూడఁ ♦ గూలిపోయెడిని ౪౩
అపగత కులధర్మ ♦ లౌ వారికెపుడు
నరకవాసము గల్గు ♦ నా విందుము హరి ౪౪
రాజ్యంబు సుఖమును ♦ గ్రహియించునాస
స్వజనంబు వధియింపఁ ♦ బనిఁ బూన నెంతొ
పాపంబు సేయఁ బా♦ల్పడినార మకట ౪౫
బాణముల్ విడనాడి ♦ బదు లేయని నను
ధార్తరాష్ట్రు లని శ♦స్త్రకరులౌ వారు
నై త్రుంతురే న్నాక♦చౌ మేల్ మఱంత ౪౬
అర్జునుం డి ట్లని ♦ యాడి యుద్ధమున
వింటిని గోలతో ♦ విడనాడి రథము
సందు శోకాకులుఁ ♦ డై కూరుచుండె. ౪౭

# రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగము

సంజయుఁడు పల్కె.

కడుజాలి మునిఁగి దుః♦ఖంబును బొంది
కొలుకులఁ గన్నీరు ♦ గుప్పు నవ్వానిఁ
గూర్చి యి ట్లని పల్కె ♦ గోవిందుఁ డంత ౧

1. కొడిమెలు = దోషములు.

శ్రీ భగవంతుఁడు పల్కె.

"నర ! విషమమునందు♦న నకీర్తికరము
నస్వర్గ్య మైన ద♦నార్యజుష్టంబు
నైన యీ కశ్మలం ♦ బయ్యె నీ కేల ? ౨
వలదు క్లైబ్యంబొందఁ, ♦ బార్థ నీయందుఁ
దగదది; శూర! క్షు♦ద్రం బైన గుండె
దౌర్బల్యమును బోవఁ ♦ దట్టి లే లెమ్ము" ౩

అర్జునుఁడు పల్కె.

"పూజ్యులౌ ద్రోణభీ♦ష్ముల నని దేవ,
కోలలఁ నేను మా♦ర్కొను టెట్లు కృష్ణ ౪
పెద్దలౌ గురువుల ♦ విదళింపకుండ
భక్షింప శ్రేయంబు ♦ భైక్షమే నిటఁగ,
నడఁతునే గురువుల ♦ నర్థకామముల
భుజియింతు నెత్తుటి ♦ భోగములె యిట. ౫
ఎయ్యది మనలకు ♦ నెక్కుడైనదియొ,
గెలుతుమో యెఱుఁగము ♦ గెలుతురో మనల
నెవ్వారి జంపి జీ♦వింప వలవమొ
యాధార్తరాష్ట్రులే ♦ యని నిల్చినారు ౬
[1]కొటికతనము సోఁకుఁ ♦ గొనస్వభావమునఁ
[2]గఱతఁ గన్గొనలేని [3]♦కఱదనే నిన్ను
నడిగెద శ్రేయ మె♦య్యది నిశ్చితమది
చెప్పు, నీమఱుఁగుఁ జొ♦చ్చిన వాఁడ నేను
నీకు శిష్యుండ న ♦ న్నీవు శాసింపు ౭

1. కొటిక = లోభి. 2. కఱతఁ = పని. 3. కణద = బుద్ధి.

భూమి నడ్డము లేని ♦ పూర్ణ రాజ్యంబు
త్రిదశాధిపత్యమొం♦దియుఁ గూడ నాదు
నింద్రియంబుల నుడి♦కించు శోకంబు
శమియించు నది చూడఁ ♦ జాలను గాదె" ౮

సంజయుఁడు పల్కె.

కృష్ణుతో నరిభీముఁ ♦ డి ట్లని నరుఁడు
నాగెఁగ నని సల్పు♦నని హరితోడ ౯
దుగదళంబుల మధ్య♦దురపిల్లు నతని
ని ట్లనె హరి హసి♦యించున ట్లీశ ౧౦

శ్రీ భగవంతుఁడు పల్కె.

వగచి తీవు వగస♦ల్పఁ దగనివారి,
జ్ఞానంబు పల్కెదు, ♦ జ్ఞాను లేడువరు
జీవులకేఁ గత ♦ జీవులకేని ౧౧
ఏఁగాని నీవేని ♦ యీరాజులేని
లేని దెన్నఁడు లేదు ♦ లేదు లేకుంట
యిందఱమును గూడ ♦ నిటఁ దరువాత ౧౨
దేహికేరీతి నీ ♦ దేహంబునందు
బాల్య యౌవనములుఁ ♦ వార్ధకత్వమును
బ్రాప్తించు దేహాంత♦రంబును నట్లె
పొందఁడు ధీరుండు ♦ మోహంబు నందు ౧౩
పొడము మాత్రాస్పర్శ♦ముల నర, సుఖము
శీతోష్ణదుఃఖముల్, ♦ స్థిరములుగావు,
వచ్చుచుఁ జనుచుండు, ♦ వాని నోర్వు నర, ౧౪

సుఖదుఃఖము లొకంట ♦ జూచు ధీరుండు
నగు నే పురుషు నివ్వి ♦ వ్యథఁ గొల్పలేవొ
యతఁడె గా తగుఁ బార్థ ♦ యమృతత్వమునకు ౧౫
లే దసత్తున కున్కి ♦ లేదు సత్తునకు
నుండమి, యీ రెంటి♦యొక్క నిక్కవము
కనఁబడు దత్త్వంబుఁ ♦ గనువారిచేత ౧౬
ఇది యంత దేన నా♦వృతమయి యుండు
దాని నాశము లేని ♦ దానిఁగ నెఱుఁగు,
అవ్యయం బగుదీని ♦ నడఁగింపఁగాను
వలను గానేర దె♦వ్వానికి నైన ౧౭
అవినాశి నిత్యుండు ♦ నప్రమేయుండు
నా దేహి దేహంబు ♦ లౌ నివ్వి పార్థ,
యంతవంతములందు, ♦ కొటఁ జల్పు మని ౧౮
కూలుపఁ డీతండు ♦ కూల్పఁగాఁ బడఁడు
నెవఁడు హంతగ వీని ♦ నెంచునాతండు
నెవ్వండు హతుఁ డని ♦ యెంచునో వీని
నా యిద్దఱును గూడ ♦ నజ్ఞులౌ వారు ౧౯
పుట్టఁడు గిట్టఁ డె♦ప్పుడ గాని యీతఁ
డుండి యవ్వలను లే♦దుండమి, స్థిరుడు
పూర్వుండు నిత్యుండు ♦ పుట్టలే నతడు
చావకుండు నితండు ♦ చావఁగా నొడలు ౨౦
అవ్యయుండవినాశి ♦ యజుఁడు నిత్యుండు
నని వీని నెఱిఁగిన ♦ యాతండు పార్థ,

యెతని నెట్లడిపించు ♦ నెవని నెట్లడుచు ౨౧
పురుషుఁ డెట్టులు ప్రాఁత ♦ పుట్టముల్ వాసి
క్రొంబుట్టముల్ దాల్చు ♦ కొనునట్లె దేహి
ప్రాఁమేనులం బాసి ♦ పడయుఁ గ్రొత్తయవి ౨౨
వీనిని శస్త్రముల్ ♦ భేదింప, వేల్ప
దనలంబు, నెండింప ♦ దనిలంబు వీని,
సలుపదు తేమగ ♦ సలిలంబు వీని
నచ్ఛేద్యుఁడీతండు, ♦ నచలుం డశోష్యుఁ
డె, యదాహ్యుఁ డక్లేద్యుఁ ♦ డితఁడు సర్వగుఁడు
స్థాణువీతఁడు సనాతనుఁడు, నిత్యుండు ౨౪
కాఁడు వ్యక్తుఁడితఁడు, ♦ కాఁడు చింత్యుఁ డితఁ
డవికార్యుఁ డీతండు ♦ నంసారుగాన
నిటు వీని నెఱిఁగి శో♦కింపఁగాఁ దగవు. ౨౫

నిత్యంబుఁ బుట్టుచు ♦ నిత్యంబుఁ జనుచు
నుండు నంచును వీని ♦ నూహింతు వేని,
యేడ్వరా దట్లయ్యు ♦ నీ విట్లు వీర ౨౬
పుట్టిన వానికిఁ ♦ బ్రుంగుట విడదు
బ్రుంగిన వానికిఁ ♦ బుట్టు వీడదుగ,
యవుటచేఁ దప్పింప ♦ నలవిగానట్టి
దానికిఁ గా నీవు ♦ తగవు శోకింప ౨౭
భూతముల్ గనరాని ♦ మొదలు గల్గినవి
కనరాని తుదవియై ♦ గనవచ్చు నడుమ,
భారత, యుం దేమి ♦ పరిదేవనంబు ౨౮

కాంచు వీనిని వింతఁ♦గా నొక్కరుండు,
నట్లె వింతఁగ వీని ♦ నన్యుఁడు పల్కు
వింతఁగా నే వీని ♦ విను మఱి యొకఁడు;
ఎఱుఁగఁడు విన్నను ♦ నెవఁడును వీని ౨౯
అన్నింటి దేహంబు ♦ లందుండు దేహి
యితఁ డవధ్యుఁడు పార్థ ♦ యెప్పుడు, గానఁ
దగవు నీ కఖిలభూ♦తంబులు వగవ ౩౦
తగవు స్వధర్మంబుఁ ♦ దలపోసి యైనఁ
గంపింప, ధర్మ్య మా ♦ కలనకన్నఁగద
శ్రేయ మొం డొకటి క్ష♦త్త్రియునకు లేదు ౩౧
తనయంతఁ దాన ప్రా♦ప్తం బైన యిట్టి
బవరంబు, తెఱచిన ♦ వాకిలి గలుగు
స్వర్గ మా! నది సుఖ♦వంతు లౌ నట్టి,
క్షత్త్రియులకుఁ బార్థ ♦ సంప్రాప్త మౌను ౩౨
నల్పవే నీ ధర్మ్య♦సంగ్రామ మీవు,
నీదు ధర్మంబును ♦ నీదగు కీర్తిఁ
బోనాడి పాపంబుఁ ♦ బొరయఁగాఁ గలవు;
అల్పులు నీదగు ♦ నవ్యయం బైన
యపకీర్తి వాక్రుత్తు, ♦ రపకీర్తి యగును
చావు కన్నను మింపు ♦ సంభావితునకు ౩౪
భయముచే రణమును ♦ వదలితి వంచుఁ
దలఁచెదరు మహార♦థముల వారు నిను;
బహుమతుండవు ము, న్నె♦వరిలోన వారి
యందున లాఘవం ♦ బలవడు నీకు ౩౫

నీదు సామర్థ్యంబు ♦ నిందించు నీదు
పగవార లనరాని ♦ పల్కులం డ్రెన్నొ
యంతకన్నను దుఃఖ ♦ మధికమే ముండు. ౩౬
హతుఁడ వైనను స్వర్గ ♦ మలవడు నొండె,
నవని నేలెదవు గె♦ల్పొయినచోఁ, గానఁ
గదనంబునకుఁ బూని ♦ కౌంతేయ లెమ్ము ౩౭
సౌఖ్యంబు దుఃఖంబు ♦ జయము నజయము
లాభనష్టములఁ దు♦ల్యంబులఁ జేసి
పోరఁ బూను మఘంబుఁ ♦ బొంద వట్లైన ౩౮
సాంఖ్యంబులోని యీ♦జ్ఞానంబు నీకు
బోధితం బయ్యె, నే♦బుద్ధితోఁ గూడఁ
గర్మబంధంబులఁ ♦ గడవంగఁ గలవొ,
యట్టి యీయోగంబు ♦ నాలింపు; పార్థ. ౩౯
[1] దొరకోలు చెడదిందు ♦ దోసంబు లేదు,
ఈధర్మలేశంబు ♦ [2]నేర్చుఁ బెను బీతు ౪౦
అచల మౌ నొక్కటి ♦ యగు బుద్ధియందు
నర్జునా, యవ్యేడు ♦ నస్థిరాత్మునకుఁ
గొనలేని పలు తెఱం♦గుల బుద్ధులు గద ౪౧
ఐశ్వర్యభోగంబు ♦ లందఁగాఁ దలఁచు
నానాక్రియల్ గల్గి♦న యదియు నైన
పుట్టు కర్మమున క♦వును ఫలం బనెడి
వేదవాదరతులు, ♦ వేరు లే దనుచు

1 దొరకోలు = యత్నించుట. 2 ఏర్చుఁ = చక్కఁబఱచు.

స్వాదుగాఁ బల్కున ♦ పండితుల్ దాన
నపహృతచేతస్కు ♦ లౌ నట్టి వారు,
నైశ్వర్యభోగంబు ♦ లాశించువారు,
కామాత్మకులును, స్వ♦ర్గపరు లౌ వారు,
చెందలేరు సమాధి ♦ స్థిరబుద్ధిఁ బార్థ ౪౨, ౪౩, ౪౪
వేదముల్ త్రైగుణ్య ♦ విషయముల్ పార్థ,
త్రైగుణ్యములఁ బాసి ♦ ద్వంద్వముల్ వీడు,
యోగంబు క్షేమంబు ♦ నుజ్జన సల్పు,
మగు నిత్యసత్త్వస్థుఁ ♦ డాత్మవంతుఁడవు. ౪౫
నలుదెసల్ జలము పొం♦గారు సరస్సు
నం దెంత ఫలముండు ♦ నఖిలవేదముల
జ్ఞాని యగు బ్రాహ్మణు♦నకు నం దె ఫలము. ౪౬
కర్మ మందే యధి♦కార మెన్నేని
కాదు ఫలంబులం ♦ గలది నీ, కీవు
కర్మంబు ఫలహేతు♦కంబు గా నీయ
వల, దకర్మంబునన్ ♦ వలను సంగంబు. ౪౭
యోగివై సంగంబు ♦ నూడిచి విజయ,
సిద్ధ్యసిద్ధుల నొంటిఁ ♦ జేసి కర్మంబు
నాచరింపు సమత్వ ♦ మండ్రు యోగంబు ౪౮
కడు లొచ్చు బుద్ధియో♦గము కన్నఁ జేత,
ఫలముఁ జూచెడు వారు ♦ పార్థ కృపణులు,
బుద్ధియోగమునందుఁ ♦ బొందుము శరణు ౪౯
బుద్ధియుక్తుఁడు బ్రోయుఁ ♦ బుణ్యపాపముల

భువిఁ గాన యత్నింపు ♦ బుద్ధియోగంబు,
కౌశలం బగును యో♦గము కర్మములను ౫౦
బుద్ధిఁ గూడిన మాన♦వుల్ కర్మజ మగు
ఫలము విడిచి జన్మ♦బంధముక్తులయి
యందుదురు గదా య♦నామయ పదవి ౫౧
ఎపుడు మోహకలిల ♦ మీఁదు నీ బుద్ధి,
వినిన దానిదియును ♦ వినఁగల దాని
వైరాగ్య, మప్పుడు ♦ పడయఁగాఁ గలవు ౫౨
శ్రవణము వలన వి♦ప్రతిపన్నమైన
యట్టి నీబుద్ధి స♦మాధి నిల్కడగ
స్థిరముగా నెప్పుడు ♦ చేరియుండెడినొ
యప్పుడు యోగంబు ♦ నందెదవీవు. ౫౩

అర్జునుఁడు పల్కె.

ఆర్యా! సమాధిస్థుఁ ♦ డౌ స్థితప్రజ్ఞు
తీరేమి, యే మను♦స్థితబుద్ధి, యెట్లు
నాతండు నుండునే ♦ యనువున నడుచు ౫౪

శ్రీ భగవంతుఁడు పల్కె.

మనమునందుండు కా♦మంబులనెల్ల
సవ్యసాచి, యెపుడు ♦ చక్కఁగా విడిచి,
యాత్మచే నాత్మనే ♦ యానంద మొందు
వాఁ డౌ, నపుడు స్థిత♦ప్రజ్ఞుఁ డనఁబడు ౫౫
దుఃఖంబులను మదిఁ ♦ దొందర లేని,
సుఖముల వలనను ♦ స్పృహలేనట్టి,

క్రోధరాగభయముల్ ♦ గూడనివాఁడు,
నగు ముని స్థిరబుద్ధి ♦ యని వచించెదరు. ౫౬
సుకమైనఁ బొంగఁడు ♦ సోలఁడు కీడు
చేకూడ, నెందేని ♦ చెలిమి చేయండో,
యండ్రు ప్రతిష్ఠిత ♦ మాతనిప్రజ్ఞ. ౫౭

అన్నిప్రక్కలఁ గూర్మ ♦ మంగముల్ ముడుచు
న ట్లింద్రియము లింద్రి♦యార్థంబు లందు
నుండి యాతం డెప్పు ♦ డుడిగించు, నపుడు
నాతనిదౌ ప్రజ్ఞ ♦ యౌఁ బ్రతిష్ఠితము. ౫౮
వదలును రసము త♦ప్పఁగ విషయములు
నాహారహీనుండు ♦ నౌ దేహి, నతని
రసమును విడుచుఁ బ♦రముఁ గాంచఁగాను. ౫౯

అర్జునా! యత్నించు ♦ నతఁ డయ్యుఁ గూడఁ
బ్రాజ్ఞుని మనమును ♦ బలవంతముగను
నణఁచు నుద్ధతములు ♦ నౌ నింద్రియములు. ౬౦
వాని నన్నింటిని ♦ బద్ధముల్ సేసి
వలయు యుక్తుండు మ♦త్పరుఁడుగఁ గాఁగ,
నింద్రియంబులు తన ♦ కెవనికి లోను
నాతని ప్రజ్ఞగా ♦ యౌఁబ్రతిష్ఠితము ౬౧
ధ్యానింప విషయంబు ♦ లగువానియందు
సంగంబు నరునికి, ♦ సంగంబువలనఁ
గామంబు గల్గెడుఁ, ♦ గామంబు వలనఁ
గ్రోధంబు ప్రభవించుఁ, ♦ గ్రోధంబువలన

మోహంబు పుట్టెడు, ♦ మోహంబువలనఁ
స్మృతివిభ్రమం బౌను, ♦ స్మృతివిభ్రమమున
బుద్ధి నాశముఁ జెందు, ♦ బుద్ధినాశంబు
వలన వినాశంబు ♦ ప్రాప్త మయ్యెడిని ౬౩

ద్వేషంబు రాగంబు ♦ విడనాడి తనకు
నణఁగిన వగు నింద్రి ♦ యంబులతోడ
విషయంబు లందుఁ బ్ర♦వేశించు నట్టి
వశ్యాత్మునకు నల♦వడుఁ బ్రసాదంబు. ౬౪

నీల్గు వాని వెత ల♦న్నియుఁ బ్రసాదమునఁ,
జెచ్చెర నె ప్రసన్న ♦ చేతస్కు నకును
బుద్ధి స్థిరత్వంబుఁ ♦ బొందిన దాను. ౬౫

లేదు భావన బుద్ధి ♦ లే దయుక్తునకు,
భావన లేనట్టి ♦ వానికి లేదు
శాంతి ; సౌఖ్యంబు న♦శాంతున కెట్లు ? ౬౬

ఏ మనంబు చరించు ♦నింద్రియంబులకు
వశమై యది హరించు ♦ వాని దౌ ప్రజ్ఞ,
నుదకమం దనిలంబు ♦ నోడను బోలె. ౬౭

ఔటఁ, బ్రతిష్ఠితం ♦ బగు వాని ప్రజ్ఞ
యెవని యింద్రియములు ♦ నింద్రియార్థముల
వలన పీర, మరలిం♦పఁబడు నంతటను ౬౮

అఖిలభూతంబుల ♦ కగు నెద్ది రాత్రి
యందు మేల్కాంచు సం♦యమి, చూచు మునికి
భూతముల్ వేచు నె♦ప్పుడు రాత్రి యద్ది. ౬౯

ఆపూర్యమాణంబు ♦ నచలంబుగాను
నుండు సంద్రముఁ జేరు ♦ నుదకంబు రీతి
నెవ్వని కోర్కె లె♦[1]ల్లెలయు నాతండు
నందు శాంతిని, బడ♦యఁడు కామకామి ౭౦
మమతయు నహమును ♦ బాసిన వాఁడు
కామంబు లన్నింటిఁ ♦ గడచి నిస్పృహత
వర్తించు నాతండు ♦ పడయును శాంతి. ౭౧
బ్రాహ్మీస్థితి యిది యౌఁ ♦ బ్రాపించి దీని
మోహంబు పొందఁడు, ♦ ముగియు కాలంబు
నందును నీ స్థితి ♦ యం దున్నఁ బార్థ
బ్రహ్మనిర్వాణంబుఁ ♦ బడయంగఁ గలఁడు. ౭౨

# మూఁడవ అధ్యాయము

## కర్మయోగము

అర్జునుఁడు పల్కె.

కలతకన్న నెఱుక ♦ ఘనమని కృష్ణ,
నీమతం బయిన దే♦ని హరి నన్నేల
యీ ఘోరకర్మంబు♦నందు నిల్పెదవు. ౧
వ్యామిశ్రముగ నున్న ♦ వాక్యంబుచేత
నా బుద్ధి మోహ మం♦దఁగఁ జేయు నటుల
నున్నావు దృఢముగా ♦ నొక్కటి చెప్పుమ
శ్రేయంబు దేవ నేఁ ♦ జెంద నౌ దాని. ౨

1. ఎలయు = ప్రవేశించు.

శ్రీ భగవంతుఁడు పలికె.

ఈ లోకమున నిష్ఠ ♦ యిరు తెఱంగులను
గలదని మున్న నేఁ ♦ గఱపితి ననఘ,
యోగులకును గర్మ♦యోగంబుచేత
జ్ఞానయోగంబుచే ♦ సాంఖ్యుల కనియు. ౩
నైష్కర్మ్య మొందఁడు ♦ నరుఁడు కర్మంబు
మొదలు పెట్టమిచేతఁ, ♦ బొందంగలేడు
మఱి సన్న్యసించిన ♦ మాత్రాన సిద్ధి. ౪
క్షణమైన నెపుడేని ♦ కర్మంబు గొనక
యుండఁగ నెవఁడేని ♦ యుండఁడు గాదె,
యవశంబు గాఁగను ♦ నందఱు, ప్రకృతి
సిద్ధించు గుణముల♦చేతఁ, గర్మంబు
నాచరింపఁగఁ జే♦యఁబడుచుందురు గద ౫
కర్మేంద్రియంబులం ♦ గట్టి యెవ్వండు
నింద్రియార్థములన్ స్మ♦రించుచుండు నెద
నా విమూఢాత్ము మి♦థ్యాచారుఁ డండ్రు ౬
ఇంద్రియంబులఁ బార్థ, ♦ యెద నియమించి
కర్మేంద్రియములచేఁ ♦ గర్మయోగంబు
నాను నెవ్వఁ డసక్తుఁ ♦ డై వాఁడు మిగులు. ౭
కర్మ మెక్కుడుగ య♦కర్మము కంటెఁ
గావింపుము నియత♦కర్మ, మచేష్ట
శారీరయాత్రయు ♦ జరుగదు నీకు. ౮
యజ్ఞార్థ మగుచేత ♦ యంతకొండయిన

దానను గర్మబ♦ద్ధ మిది లోకంబు,
అంటక నర, దాని♦కై సల్పుకఱత
కల్పించి ప్రజల య♦జ్ఞంబులతోడఁ
పలికె మునుపు ప్రజా♦పతి యిట్టు లనుచు
వృద్ధిని బొందుఁడు ♦ వీనిచేఁ నివ్వి
కావుత మీ కిష్ట ♦ కామధేనువుగ ౧౦
దేవతలకుఁ దన్వి ♦ దీన నిండల్ల
దేవతలును మీకుఁ ♦ దృప్తిగావింతు,
రొకరి నొక్కరు తృప్తి ♦ నొందించువారు
నై పరం బగుశ్రేయ ♦ మందెద రీరు. ౧౧
యజ్ఞంబులను దృప్తు ♦ లయిన దేవతలు
నిత్తురు గద మీకు ♦ నిష్టభోగముల,
వారియీ యీవుల ♦ వారికి నీక
యనుభవించునో యెవం ♦ డతఁడు తస్కరుఁడె ౧౨
యజ్ఞ శిష్టం బైన ♦ దాను సుకృతులు
పాపంబు లన్నింటి ♦ వలనఁ బాయుదురు
పాకంబు తమకై యె ♦ పచరించునట్టి
పాపులో పాపంబు ♦ భక్షించువారు. ౧౩
భూతంబు లన్న సం♦భూతంబు లగును,
బ్రభవించు నన్నంబు ♦ వర్షంబువలన,
వర్షంబు యజ్ఞంబు ♦ వలనను బుట్టు,
యజ్ఞంబు కర్మమం ♦ దావిర్భవించు. ౧౪

బ్రహ్మంబువలనఁ గ♦ర్మము సంభవించు,
బ్రహ్మ మక్షరసము♦ద్భవము నా నెఱుఁగు,
కావున నన్నింటఁ ♦ గలుగు బ్రహ్మంబు
యజ్ఞంబునం దెప్పు ♦ డౌఁ బ్రతిష్ఠితము. ౧౫
ఎవఁ డనువర్తింపఁ ♦ డిట నిట్లు జరుగు
చక్రంబు నా పాప ♦ జన్ముండు పార్థ,
వ్యర్థ మయ్యెడు నింద్రి ♦ యారాముఁడు మని. ౧౬
ఆత్మయందే యెవ్వఁ ♦ డానందమొందు
నాత్మనే సంతుష్టి ♦ నాత్మనే తృప్తి,
గాంచు, నా నరునకొ ♦ కార్యంబు లేదు. ౧౭
కృతమునఁ గాని య♦కృతమందుఁ గాని
యతనికే యర్థంబు ♦ నైన లే దిచటఁ,
బొడచూప దతనికి ♦ భూతంబులందు
నెందేనియును నాశ్రయింప నౌ న దెది. ౧౮
కర్తవ్య మగునట్టి ♦ కర్మవుం గాన
సంగంబు విడనాడి ♦ సతతంబు సలుపు;
గతసంగుఁ డగుచును ♦ గర్మముఁ జలుపు
పురుషుండు పరమును ♦ బొందెడుఁ గాదె. ౧౯
సంసిద్ధి నొందిరి ♦ జనకాదులు కద
కర్మవుచేన; నౌఁ ♦ గావింప నీవు
లోకసంగ్రహము వి♦లోకించి యైన
శ్రేష్ఠులు నేదేది ♦ చేయుదు రదియె. ౨౦

యితర తా జను లాచ♦రింతురు, వారు
కంద్రు ప్రమాణంబు ♦ గాను నెద్దాని
నయ్యది లోకులు ♦ ననుసరించెదరు. ౨౧
కల్గ దేమియుఁ ద్రిలో♦కంబుల నాకుఁ
గర్తవ్య మగు నది ♦ గాని పొందంగఁ
బడనట్టి యదిగాని ♦ పడయఁ దగినది
లే నయ్యుఁ గర్మమం♦దే యుందుఁ బార్థ ౨౨
ఏఁ బరా కొందక ♦ యెపుడేని కఱత
యం దుండ కుందునే ♦ ననుసరింతురుగ
మనుజు లన్నింట నా ♦ మార్గంబుఁ బార్థ ౨౩
ఏఁ జేత సల్పనే ♦ నీ లోకములును
నడఁగు, సంకరమున ♦ కగుదును గర్తఁ
బడఁ గొట్టువాఁడ నీ ♦ ప్రజలనే నొడు. ౨౪
కఱతఁ దగుల్ గల్గి ♦ కావింతు రేటుల
నజ్ఞు లసక్తుఁడై ♦ యట్లె జ్ఞాని నర
కావించు, లోకసం♦గ్రహ[1]మించి సలుప. ౨౫
కర్మసంగు లయిన ♦ జ్ఞానహీనులకు
బుద్ధిభేదంబును ♦ బుట్టింప రాదు,
సకలకర్మంబులఁ ♦ జల్పఁ జేయఁ దగుఁ
జల్పుచు యుక్తుఁడై ♦ జ్ఞాని యౌ వాఁడు. ౨౬
ప్రకృతి గుణంబుల ♦ వలన నన్నింట
నాచరింపఁగఁ బడు ♦ నవ్వి కర్మములు,

---

1 ఇంచు = ఇచ్ఛగించు.

తాను గర్త యటంచుఁ ♦ దలఁపు సేసెడును
[1]హంకారమున మోస ♦ మందిన వాఁడు. ౨౭
గుణకర్మభేదంబు ♦ కొలఁది తత్త్వంబు
తెలియువాఁ డర్జునా, ♦ తెంచు సంగంబు,
నడుచు గుణములం గు♦ణములు నా నెఱిఁగి. ౨౮
ప్రకృతి గుణంబుల ♦ భ్రమ మొందు వారు
గుణముల చేతలం ♦ గొనుదురు తగులు,
సర్వజ్ఞుఁ డగువాఁడు ♦ చన దల్ల యేమి
తెలియని మందులం ♦ దికమక పెట్ట. ౨౯
అన్నికర్మముల నా♦యందుఁ ద్యజించి
యాత్మయందు మనస్సు ♦ నమరించి మమత
యాసయు నుడిగిన ♦ యట్టివాఁడవయి
భండనం బొనరింపు ♦ జ్వరము లేకుండ. ౩౦
ఈ నాదు మతమును ♦ నే మానవులును
నాచరించెడి వార ♦ లనుదినం బట్టి
శ్రద్ధధాను లసూయ ♦ చననివార్ గూడఁ
గర్మవు నుండియుఁ ♦ గడవంగఁ గలరు. ౩౧
ఈ నాదుమతమును ♦ నెవ్వరు మిగుల
[2]నిడుగడ నడుపరో ♦ యేమియుఁ దెలివి
లేనివారలు బుద్ధి ♦ లేనట్టి వారు
చెడిన వా రని తెలి♦సికొను మీవు; తన
ప్రకృతికిఁ దగినట్లు ♦ వర్తించు జ్ఞాని

1. హంకారము = అహంకారము.　　2. ఇడుగడ = అసూయ.

కూడను, భూతముల్ ♦ కూడెడుఁ బ్రకృతి,
నిగ్రహంబున నేమి ♦ నెఱవేఱఁ గలదు. ౩౨, ౩౩
ఎల్ల యింద్రియముల ♦ యింద్రియార్థముల
కడ నుండు ద్వేషరా♦గంబులు నిల్చి,
యీ రెంటికిని వశం ♦ బోట కారాదు,
[1]వాని కా రెండును ♦ బగతు రౌఁ గాదె. ౩౪
తనరఁ జల్పిన పర♦ధర్మమ్ము కన్న
నా మేల్ స్వధర్మంబు, ♦ నయ్యువిగుణము
నిధనంబు శ్రేయంబు ♦నిజధర్మ మందుఁ
బరుల దౌ ధర్మంబు ♦ భయము గల్గించు. ౩౫

అర్జునుఁడు పల్కె.

ఐన దేన నియుక్తుఁ ♦ డై మానవుండు
బలవంతపఱుపంగఁ ♦ బడినట్లు లితఁడు
వలవకయే చేయుఁ ♦ బాపంబుఁ గృష్ణ. ౩౬

శ్రీ భగవంతుఁడు పల్కె.

అది రజోగుణజంబు ♦ నైన కామ మది
క్రోధమంతయును గ్రమిం♦గునది పెద్ద [2]గసటు
ఎఱుఁగుము దీనిని ♦ నిట వైరిగాను. ౩౭
ముఱికిచే నద్దంబు ♦ పొగచేత నిప్పు
మావిచేఁ బిండంబు ♦ మఱుఁ గొంది యుండు
నట్టుల దానిచే ♦ నావృతం బిదియు. ౩౮
పార్థ జ్ఞానుల కెప్డు ♦ వైరి యీ దీన,

1. వానికి = అపురుషునికి. 2. కసటు = పాపము.

నిండంగ రాని దా ♦ ని ప్పగు నట్టి
కామరూపంబున, ♦ జ్ఞాన మావృతము. ౩౯
దీనికి మనము నిం♦ద్రియములు బుద్ధి
తా వండ్రు, వీనిచే♦త నిది జ్ఞానమును
బురికొని దేహుల ♦ మోహింపఁ జేయు. ౪౦
ఇంద్రియంబుల మున్ను ♦ నీవు నిల్గట్టి,
పార్థ, యుక్లాటచేఁ, ♦ బాపవంతంబు
జ్ఞానవిజ్ఞాన నా♦శంబుఁ గావించు
నట్టి దా దీనిని ♦ నడుగంటఁ జేయు. ౪౧
అంద్రు పరము లింద్రి♦యము లని, పరము
నగు నింద్రియంబుల ♦ కన్న మనంబు,
బుద్ధిపరము మన♦మునకన్న, నేఁడు
బుద్ధికన్నఁ బరుఁడ♦వును వాఁడు వాఁడు
ఇట్టులు బుద్ధికి ♦ నెక్కుడౌ వాని. ౪౨
తెలిసి యాత్మను నాత్మఁ ♦ దిరము గావించి
కామరూపంబును ♦ గష్టసాధ్య మగు
వైరిని జంపుము ♦ బాహుబలాఢ్య. ౪౩

# నాల్గవ అధ్యాయము

## జ్ఞా న యో గ ము

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఇనున కవ్యయ మైన ♦ యీ యోగ మేను
బోధించి నాఁడను, ♦ బోధించె నినుఁడు

మనువు, కిక్ష్వాకుకు ♦ మనువు బోధించె. ౧
పరువగ నీ రీతి ♦ వచ్చిన దీని
నెఱుఁగుదుర్ రాజర్షు, ♦ లిటనశియించెఁ
బార్థ, యా యోగంబు ♦ బహుకాలమునకు. ౨
నాకు భక్తుండవు ♦ నాకు సఖుఁడవు
నగుటచేతనె రహ♦స్యంబు శ్రేష్ఠంబు
నైన పురాతనం♦బైన యోగంబు
దీనినె నీ కిప్డు ♦ తెలిపితి నేను. ౩

అర్జునుఁడు పల్కె.

పుట్టితి వెనుకీవు ♦ మునుపు నినుండు
పుట్టెను ముందు నీ♦వు గఱపి తనుట
యిది యెట్టు లయ్యెడు ♦ నెఱుఁగఁగా వలయు. ౪

శ్రీ భగవంతుఁడు పల్కె.

పెక్కులు పుట్టువుల్ ♦ విజయ, యైన యవి
నావియు నీవియు ♦ నా కవి యన్ని
యెఱుక యౌఁ గౌంతేయ, ♦ యెఱుఁగవు నీవు. ౫
అవ్యయాత్ముఁడ నయ్యు ♦ నజుఁడను నయ్యు
నే భూతముల కయ్యు ♦ నఘే, ఽనింతు
నే నా ప్రకృతి నధి♦ష్ఠించి నా మాయ. ౬
ధర్మ మెప్పు డెపుడు ♦ తక్కువ యగునో
యడరు నధర్మంబు, ♦ నత్తఱి విజయ,
సృజియించు వాఁడను ♦ నేనన్నుఁ గాదె, ౭
సాధువులను బ్రోవఁ ♦ జదుప దుష్కృతుల

ధర్మంబు జక్కఁగా ♦ స్థాపించు కొఱకుఁ
బ్రతియుగంబున నేను ♦ బ్రభవించువాఁడ ౮
నరుఁడ, నా దివ్యజ♦న్మంబు కర్మంబు
నెవఁడు తత్త్వంబుగా ♦ నెఱుఁగు నీ రీతి
దేహంబు విడనాడి ♦ తిరిగి జన్మంబు
పొందఁడు, నాతండు ♦ పొందెడు నన్ను. ౯
క్రోధరాగభయముల్ ♦ గూడని వారు
నను జేరినట్టివార్ ♦ జ్ఞానతపమునఁ
బరిశుద్ధు లయినట్టి ♦ వారు మన్మయులు
నాదు భావము పొంది♦నారు పెక్కండ్రు. ౧౦
ఎవరు నన్ జేరెద ♦ రెట్లు నే వారి
నట్టులే బ్రోచెద, ♦ నన్నింట జనులు
నాదు మార్గంబున ♦ నడుతురు పార్థ ౧౧
కర్మసిద్ధిని గాంక్ష ♦ గలిగిన వారు
పూజింతు రిట వేలు♦పులఁ, గల్గుఁగాదె
కర్మసిద్ధి నరలో♦కంబున వేగ. ౧౨
గుణకర్మభాగంబు ♦ కొలఁది వర్ణముల
నాల్గింటి సృజియించి♦నాఁడను నేను,
దాని కే నయ్యుఁ గ♦ర్తను, నవ్యయుండ
ననియు నేఁ గర్తఁగా ♦ ననియు నెఱుఁగుము. ౧౩
కర్మఫలముఁ గోరఁ, ♦ గర్మముల్ నన్ను
నంట, వేఁ డెఱుఁగు నీ ♦ యనువున నన్నుఁ
గర్మములను వాఁడు ♦ కాఁడు బద్ధుండు. ౧౪

ముక్తిఁ గోరినయట్టి ♦ పూర్వులు గూడఁ
గర్మ విట్టు లెఱింగి ♦ కావించినారు,
కావున నీవును ♦ గావింపు మునుపు
మునుపటి వారలు ♦ పొనరించిన పనె. ౧౫

కర్మ మే దేది య♦కర్మ మనియెడి
చోఁ బండితులకేని ♦ నుడివడుఁ దెలివి ;
దే యె దెఱింగిన ♦ నెడయుదు కీడు
నుండి, నీ కా కర్మ ♦ ముగ్గడించెదను, ౧౬

కర్మము నౌ నెఱుఁ♦గ, వికర్మమునగు
నెఱుఁగ, నకర్మము ♦ నెఱుఁగ నౌఁ గాదె ;
కష్ట మౌ నెఱుఁగంగఁ ♦ గర్మము గతిని ౧౭

కర్మమునందు న♦కర్మంబు నెవఁడు
కను నకర్మంబునఁ ♦ గర్మము, వాఁడు
బుద్ధిమంతుఁడు మాన♦వులను యుక్తుండు,
కర్మము లన్నియుఁ ♦ గావించువాఁడు. ౧౮

అఖిలయత్నంబుల ♦ నంట వెవ్వానికి
సంకల్పకామముల్, ♦ జ్ఞానాగ్నిలోనఁ
గాల్పంగఁ బడినట్టి ♦ కర్మముల్ గల్గు
వానిని జ్ఞానులు ♦ పండితుఁ డంద్రు. ౧౯

కర్మఫలంబునఁ ♦ గతసంగుఁ డగుచు
నేయాశ్రయము లేక ♦ తృప్తుఁడై యెపుడు
కర్మమునను వాఁడు ♦ కడు మెలఁగుచును
నుండియు నించుకే ♦ నొనరింపఁ డతఁడు. ౨౦

ఆపి చిత్తాత్మల ♦ నాశల విడిచి
కైకొను టెల్లయుఁ ♦ గడచి, దైహికపు
కర్మమంతె యొనర్పఁ ♦ గలుష మొందండు. ౨౦
తనయంతఁ దొరికిన ♦ దానితోఁ బొంగి,
ద్వంద్వముల్ దాఁటి మ♦త్సరము పోనాడి,
సిద్ధ్యసిద్ధుల యందుఁ ♦ జిత్త మొక్కటిగఁ
గర్మ మొనరిచియుఁ ♦ గాఁడు బద్ధుండు. ౨౨
ముక్తుఁడై సంగంబు ♦ పోయిన వాని
జ్ఞానమందు మనస్సు ♦ నాటిన వాని
యజ్ఞంబు కొఱకయి ♦ యాచారము గల
వాని కర్మం బెల్లఁ ♦ బ్రవిలియ మగును. ౨౩
బ్రహ్మ మౌను హవిస్సు ♦ బ్రహ్మ మర్పణము
బ్రహ్మాగ్ని హుతమగు ♦ బ్రహ్మముచేత
నెల్లకర్మము బ్రహ్మ♦మేగ భావించు
వానికి బ్రహ్మంబె ♦ పడయనగు నది, ౨౪
యోగులు నొక కొంద♦ఱొనరించు వారు
దైవయజ్ఞంబు కొం♦దఱును బ్రహ్మాగ్ని
యందు యజ్ఞంబును ♦ యజ్ఞంబుచేన
హోమం బొనర్చెద, ♦ రొరులు శ్రోత్రంబు
మున్నగు నింద్రియం♦బుల సంయమాగ్ని
వేల్తురు, శబ్దాది♦విషయముల్ మఱియుఁ
గొందఱు నింద్రియా♦గ్నుల వెలిచెదరు ౨౫, ౨౬
ఇంద్రియ కర్మంబు ♦ లెల్ల బ్రాణంపుఁ
గర్మంబులను గూడ ♦ జ్ఞానదీపితము

నగునట్టి యాత్మ సం♦యమ యోగవహ్ని
హోమంబు సేయుదు ♦ రొక్క కొందఱును ౨౭

ద్రవ్యయజ్ఞంబు స్వా♦ధ్యాయ యజ్ఞంబు
జ్ఞానయజ్ఞము తాప♦స మగు యజ్ఞంబు
నొనరింతు రొరులట్లె ♦ యోగయజ్ఞంబు
చెలుపుదురు యతులు ♦ సంశితవ్రతులు ౨౮

పరులు ప్రాణాయామ ♦ పరులును నైన
యట్టి వా రాపి ప్రా♦ణాపాన గతులఁ
బ్రాణంబునందు న♦పానంబు మఱియుఁ
బ్రాణంబు వేల్తు ర♦పానంబు నందు ౨౯

అశననియతి గల♦యట్టివా రొరులు
ప్రాణముల్ వేల్తురు ♦ ప్రాణంబులందు.
వీ రెల్లరును యజ్ఞ♦విదులు యజ్ఞమునఁ
బాపంబులను నెడఁ ♦ బాసినవారు. ౩౦

యజ్ఞశిష్టం బైన ♦ యమృతంబుఁ గ్రోలు
వారు సనాతన ♦ బ్రహ్మమొందెదరు.
యజ్ఞంబు చేయని ♦ యతని కిహంబు
నమరదు తక్కిన ♦ యది యేడ విజయ ౩౧

బహువిధ యజ్ఞముల్ ♦ బ్రహ్మముఖంబు
గా నిట్లు ప్రబలెను ♦ గనుమవి యెల్ల
గర్మంబువలనను ♦ గలిగెనా నిట్లు
గాంచి మోక్షంబును ♦ గలవు పొందంగ. ౩౨

ఘనమగు ద్రవ్యయ♦జ్ఞంబున కన్న
జ్ఞానయజ్ఞము వీర, ♦ జ్ఞానమందు నర,

యఖిల మౌ కర్మంబు ♦ నంతయు దా నెల్ల ౩౩
ప్రణిపాతమునఁ బరి ♦ ప్రశ్నచే సేవ
నెఱుఁగుము దాని, వ♦చింపఁగాఁ గలరు
దేని నెఱింగినఁ ♦ దిరిగి మోహంబు
ని ట్లొందవో, దేన ♦ నెల్ల భూతముల
నాత్మఁ గందు, వట నా♦యందు, నీ కట్టి
జ్ఞానంబుఁ దత్త్వంబు ♦ కను జ్ఞానులు నర. ౩౫
పాపులలో నెల్లఁ ♦ బ్రబల మౌ పాపి
వగు దేనియు నెఱుక ♦ యను తెప్ప చేన
నీఁదంగఁ గలిగెద ♦ వెల్ల పాపమ్ము. ౩౬
మండెడి నిప్పెట్లు ♦ మండల బూది
గావించు నట్టుల ♦ జ్ఞానాగ్ని యన్ని
కర్మంబులను బూది ♦ గావించు విజయ. ౩౭
జ్ఞానంబుతో సరి♦గాఁ బవిత్రంబు
కల్గదుగా యిటఁ; ♦ గాలంబు నందు,
యోగసంసిద్ధిని ♦ నొందిన వాఁడు
తనయందుఁ గాంచెడు ♦ దానిని దానె. ౩౮
సంయతేంద్రియుఁడును ♦ శ్రద్ధ గలాఁడు
పడయు జ్ఞానంబుఁ ద♦త్పరుఁడు నౌ వాఁడు,
జ్ఞాన మొంది యచిర♦కాలంబు లోనఁ
బరమ మౌ శాంతిని ♦ బడయంగఁ గలఁడు. ౩౯
శ్రద్ధ లే నట్టియు ♦ జ్ఞానంబు లేని
సంశయాత్ముఁడు చెడు, ♦ సంశయాత్మునకు
లే విహపరములు ♦ లేదు సుఖంబు, ౪౦

యోగంబుచే జేత ♦ లుడిగిన వాని
జ్ఞానంబునఁ గతసం♦శయుఁ డైన వాని
నాత్మవంతుండును ♦ నై నట్టివానిఁ
గర్మముల్ బంధింపఁ ♦ గానవు పార్థ. ౪౧
కావునఁ బార్థ య♦జ్ఞాన జాతంబు
నై యెద నుండు నీ ♦ దైన యీ శంక
జ్ఞానాసిఁ ద్రెంచి యో♦గము బూను లెమ్ము. ౪౨

---

# ఐదవ అధ్యాయము.

## కర్మసన్న్యాసయోగము.

---

అర్జునుఁడు పల్కె.

కర్మసన్న్యాసంబుఁ ♦ గంసారి, మరల
యోగంబుఁ బొగడెద ♦ వొకటి గుర్తించి
చెప్పుము నా, కెద్ది ♦ శ్రేయ మీ రెంట. ౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

కర్మసన్న్యాసంబు ♦ కర్మయోగంబు
రెండునుగూడ ని ♦ శ్శ్రేయస మిచ్చుఁ,
గర్మసన్న్యాసంబు ♦ కన్నను ఘనము
నగుఁ గర్మయోగంబు ♦ నా రెంటఁ గూడ. ౨
కోపింపఁ డెవ్వండు ♦ కోరఁ డెవ్వండు
నాతండు నిత్యస♦న్న్యాసి నా నెఱుఁగు,
ద్వంద్వముల్ లేనట్టి ♦ వాఁడు సుఖముగ
బంధంబులనునుండి ♦ పాయుఁగా శూర ౩

ఒకటి సాంఖ్యము మఱి ♦ యొకటి యోగమని
బాలు రందురు గాని ♦ పండితు లనరు,
చక్కఁగా నొకటైన ♦ సాధించు వాఁడు
ఫలము రెండింటిది ♦ పడయఁగాఁ గలఁడు. ౪

సాంఖ్యంబుచేఁ గల్గు ♦ [1] చక్కి యోగంబు
వలనఁ గూడను నల♦వడఁగను గలదు
యోగంబు సాంఖ్యంబు ♦ నొక్కటిగాను
జూచు నట్టియతండె ♦ చూచెడివాఁడు, ౫

సన్న్యాసమొందఁ గ♦ష్టంబు యోగంబు
పొందక, యోగి యా ♦ మునియు బ్రహ్మంబు
శీఘ్రుంబె యర్జునా, ♦ చెందఁగాఁ గలఁడు. ౬

విజితేంద్రియుండును ♦ విజితాత్ముఁడు మఱి
పరిశుద్ధ మా నాత్మ ♦ వాఁడును యోగి
యఖిల భూతాత్మ యా ♦ నాత్మగలాఁడు,
చేయుచుండియుఁ గూడఁ ♦ జెందఁడు సోఁకు. ౭

కూర్కుచుఁ గనుచు మూ♦ర్కొనుచు నంటుచును
వినుచును దినుచు నూ♦పిరిని గొనుచును
గొనుచు విడుచుచుఁ బ♦ల్కుచును జనుచును
గనులను దెఱచుచు ♦ గాని మూయుచును
నింద్రియార్థంబుల ♦ నింద్రియంబులును
మలసెడు నను నది ♦ మదిలోన నిలిపి,

1. చక్కి = స్థానము.

యొనరించు నద్ది లే ♦ దొక్కఁటే నేను
నని, యుక్తుఁడై యెంచ ♦ నగుఁ దత్త్వవిదుఁడు. ౮, ౯
బ్రహ్మంబునందుఁ గ♦ర్మంబుల నిల్పి
సంగంబు విడనాడి ♦ సలిపెడు నెవఁడు,
తామరాకును నీరు ♦ తాకని పగిది,
పాపంబువలనను ♦ వాఁ డంటఁ బడఁడు. ౧౦
బుద్ధి మనఃకాయ♦ములఁ గేవలంబు
నింద్రియంబులచేత ♦ నేనియుఁ గాని
యోగులు కర్మంబు ♦ నొనరింతు, రాత్మ
శుద్ధికొఱకు నయి ♦ సోఁకును విడిచి. ౧౧
కర్మఫలంబును ♦ గడచి యుక్తుండు
నౌ వాఁడు నైష్ఠికం ♦ బౌ శాంతిఁ గనును.
కామంబు పురికొల్పఁ♦గా ఫలాసక్తి
కలిగి యయుక్తుండు ♦ కట్టువడెడిని. ౧౨
మనసుచే సర్వక♦ర్మంబుల విడిచి
చేయింపకుండను ♦ జేయకయయును
దొమ్మిది వాకిళ్ల♦తోనుండు పురిని
హాయితోడను వశి ♦ యవు దేహి యుండు. ౧౩
కర్తృత్వమును గాని ♦ కర్మముల్ గాని
కలిగింపఁడు పతి లో♦కమునకుఁ గఱత
పంట కూడికగాని, ♦ ప్రకృతియే పఱచు. ౧౪
ఎవని పాపముఁ గాని ♦ యెవని పుణ్యంబుఁ
గాని కాఁడు విభుండు ♦ కైకొను వాఁడు;

అజ్ఞానమున జ్ఞాన ♦ మావృతం బైన
యది, దాన జంతువు ♦ లందు మోహంబు. ౧౫
అడఁగు నాత్మజ్ఞాన♦మందు నెవ్వరిది
యైన యా యజ్ఞాన, ♦ మవ్వారిజ్ఞాన
మాపరంబును సూర్యు ♦ నట్లు వెల్గించు ౧౬
ఆ యాత్మ నా నిష్ఠ ♦ నా పరాయణత
నల బుద్ధియును గలవా♦రలు జ్ఞానమునను
బాపంబు చెదరిన ♦ వార లై తిరిగి
రా నట్టి పదమును ♦ బ్రాపించు వారు. ౧౭
విద్యావినయునందు ♦ విప్రునం దైనఁ
గుంజరం బందైన ♦ గోవునం దైనఁ
శ్వానమం దైన శ్వ♦పాకునం దైన
సమదర్శనంబుతో ♦ జ్ఞాను లుండెదరు. ౧౮
మనసు నెవ్వరిది సా♦మ్యంబున నుండు
నిటనె సర్గము వారు జ♦యించిన వారు,
బ్రహ్మ మాఁ గద దోష♦రహితంబు సమము,
బ్రహ్మమం దుందురు ♦ వారు కాఁబట్టి. ౧౯
పల్లటిల్లని బుద్ధి ♦ వాఁడు, మౌఢ్యంబు
నందనివాఁడు, బ్ర♦హ్మంబున నుండు
నటువంటివాఁడు; బ్ర♦హ్మవిదుఁడు, చనదు
ప్రియమైనఁ బొంగ న♦ప్రియమైన గుంద ౨౦
వెలిసోఁకులన్నది ♦ వెనఁగనీకుండ
నాత్మలోఁ గలసుఖ ♦ మానెడు నట్టి

యల బ్రహ్మయోగ యు♦క్తాత్ముండు, చేటు
కలుగని సుఖమును ♦ గాంచెడి వాఁడు ౨౧
సోఁకులం గల్గెడు ♦ సుఖము లెవ్వవియొ
దుఃఖహేతువులె యౌఁ, ♦ దుదమొదల్ గలవి,
వానిలోనను సుఖిం♦పఁడు జ్ఞాని పార్థ. ౨౨
క్రోధకామముల నా ♦ క్షోభ మిచ్చుటనె
యోర్వఁ గలం డెవ్వఁ ♦ డొడ లూడక మును,
నాతండు యుక్తుండు ♦ నా నరుండు సుఖి ౨౩
తనయందె విహరించుఁ ♦ దనయందు నెవఁడు
నందెడు సౌఖ్యంబు♦ నల్లేఁడు వెలుగు
వహియించుఁ దనయందె, ♦ బ్రహ్మభూతుఁ డయి
బ్రహ్మనిర్వాణంబుఁ ♦ బడయు నా యోగి. ౨౪
అఖిల భూతహితార్థు ♦ లకలుషాత్ములును
నద్వైధులు యతాత్ము♦లౌ నట్టి ఋషులు
బ్రహ్మనిర్వాణంబుఁ ♦ బ్రాపించువారు ౨౫
కామకోపంబులం ♦ గడచినయట్టి
* యాత్మజ్ఞులు యతాత్ము ♦ లైన యతులకు
బ్రహ్మనిర్వాణంబు ♦ వఱలు నెల్లెడల.
వెలుపలి సోఁకుల ♦ వెలిపుచ్చి, కనుల
బొమ్మల నడుమనె ♦ పూనిచి, నాస
నడుమ నాడెడు నపా♦నంబుఁ బ్రాణంబు
రెండింటినిం బొన♦ర్చి సమంబులుగను,

* విదితాత్మనాం (పా) విజితాత్మనాం.

బుద్ధి నింద్రియం♦బులను మనస్సు
స్వాధీనములఁ జేసి, ♦ భయము కోపంబు
కామముల్ వీడి, మో♦క్షముఁ బొందఁ గోరు
ముని యెవ్వఁ డాతండు ♦ ముక్తుఁడే యెప్పుడు. ౨౭.౨౮
యజ్ఞంబుఁ దపమును ♦ నానెడు నట్టి
సర్వలోకమహేశు ♦ సర్వభూతముల
సుహృదు నన్ను నెఱింగి ♦ చొచ్చును శాంతి. ౨౯

## ఆఱవ అధ్యాయము

### ఆత్మసంయమయోగము

శ్రీ భగవంతుఁడు పల్కె.

కర్మఫలంబును ♦ గమనింపకుండఁ
గర్తవ్యకర్మంబుఁ ♦ గావించు నెవఁడు
నాతండె సన్న్యాసి ♦ యాతఁడే యోగి,
కాఁడగ్ని హీనుండు ♦ కాఁడక్రియుఁడును
అర్జునా, సన్న్యాస ♦ మందురు దేని
నయ్యది యోగంబు ♦ నని యెఱుంగునది,
సన్న్యసింపఁ బడని ♦ సంకల్పములను
గల యెవ్వఁ డేనియుఁ ♦ గాడుగా యోగి ౨
యోగంబుఁ బొందఁగా ♦ నుత్కంఠ గలుగు
మునికి సాధనము క ♦ ర్మ మని యనెదరు.
అంద్రు యోగారూఢుఁ ♦ డైన యంతటను

శమ మతాను వానికే ♦ సాధనం బనుచు ౩
ఎపుడు కర్మములను ♦ నింద్రియార్థముల
ననుషంగమును వీడు ♦ నప్పుడు కాదె,
యఖిల సంకల్ప స♦న్న్యాసి యగు వాని,
ననియెడు వారు యో♦గారూఢుఁ డంచు ౪
ఆత్మచేతను దన♦నగును దేల్చుకొనఁ,
దన నడఁచికొనంగఁ ♦ దగ, నాత్మ యెగద
తనచుట్ట మాత్మయే ♦ తన విరోధియును. ౫
తననెవ్వఁ డాత్మచే♦తనె గెల్చె నట్టి
వానిది యగునాత్మ ♦ బంధు వాతనికిఁ,
దనయందు గెల్వ బం♦దనివాని యెడనొ
వైరంబు కావించు ♦ వైరి యట్లాత్మ. ౬
హెచ్చులొచ్చుల నట్లె ♦ యెగ్గు లగ్గులను
జలివేడుముల నాత్మ ♦ సాధించునట్టి
బహుశాంతునకు నొందఁ♦బడుఁ బరమాత్మ. ౭
జ్ఞానంబుచేత వి♦జ్ఞానంబుచేత
[1]నాదట చెందిన ♦ యాత్మఁ గలాఁడు,
నిశ్చలుండు విజితేం♦ద్రియుఁడును నైన
పొన్నుతా మనొక్క♦పోలికఁ జూచు,
యోగిని నందురు ♦ యుక్తుండు నాఁగ. ౮
అరిసుహృన్మిత్ర మ♦ధ్యస్థబంధువుల

1. ఆదట = తృప్తి.

యందు నుదాసీను♦లందు సాధువుల
యందు ద్వేష్యులఁ బాపు♦లందు సమమగు
బుద్ధిని గలవాఁ డ♦వును విశిష్టుండు. ౯
కోరకయును గయి♦కొనకయు యోగి
చిత్తాత్మలను లోను ♦ జేసి యేకాకి
యై రహస్యం బైన ♦ యట్టిచో నుండి
సతతము నాత్మ ని♦శ్చలముసేయ నగు ౧౦
కడు నెత్తు కడు లోఁతు♦కాని యెడఁ [1]గడఁ
గుశలపై నజినంబుఁ ♦ గోక నాపైనఁ
గల యాసనంబును ♦ గట్టిగాఁ దనకు
స్థాపించి దానిమీఁ♦దను గూరుచుండి,
యమరించి మనసు నే♦కాగ్రంబుఁగాను
జితేంద్రియంబులఁ ♦ జేష్టలఁ గట్టి,
యాత్మశుద్ధికి యోగ ♦ మాచరింపనగు ౧౧, ౧౨
మేనును దలయును ♦ మెడయుఁ జక్కంగఁ
గదలకుండ స్థిరము♦గాఁగ ధరించి,
దిక్కులం జూడక ♦ దృష్టిని దనదు
నా సికాగ్రంబున ♦ నాటి మనంబు
నాఁపి, ప్రశాంతాత్ముఁ ♦ డగుచు, భయంబు
నడఁగించి, బ్రహ్మచ♦ర్యవ్రత మూని,
చిత్తంబు నాపైనఁ ♦ జేరిచి, నన్నె

---

1. ఎడ = చోటు.

భావించుచును, యోగి ♦ వలయుఁ గూర్చుండ. ౧౩,౧౪
నియతమానసుఁడై య ♦ నిశమును యోగి
యాత్మ నిట్లాఁపి, నా ♦ యందలి దైన
నిర్వాణ పరమశా ♦ న్తిఁ బడయుఁవాఁడు ౧౫
ఎక్కువ దినువాని ♦ కేమియుఁ దినని
వానికిఁ, గడుఁగూర్కు ♦ వానికిఁ గూర్కు
లేనివానికిఁ బార్థ ♦ లేదు యోగంబు ౧౬
పాటిగా విహరించుఁ, ♦ బాటిగాఁ గుడుచు,
మెలఁకువ కూర్కులఁ ♦ మితముగాఁ గలుగు,
మితముగాఁ బనులందు ♦ మెలఁగు, నాతనికి
దొరకొను, దుఃఖముల్ ♦ దొలఁచు యోగంబు. ౧౭
నియతమై చిత్తంబు ♦ నిల్చునో యాత్మ
యందె యెప్పుడు, కోర్కె ♦ లన్నింటను స్పృహ
నుడిపి, యట్లనఁబడు ♦ యుక్తుండు నాఁగ. ౧౮
గాలి గొట్టని చోటఁ ♦ గలుగు దీపంబు
చలియింప కుండునే ♦ చొప్పున నదియు
నాత్మయోగంబు న ♦ భ్యాసంబు చేయు
యతచిత్తుఁ డగుయోగి ♦ కగు నుపమంబు ౧౯
ఎట యోగసేవ వా ♦ రింపఁ బడుమది
యుపరతిఁ గను, నెట ♦ నుండియు నాత్మ
నాత్మచేఁ గని యాత్మ ♦ యందె తుష్టిఁగొను,
నింద్రియంబుల మీఱి ♦ యెఱుఁగ బుద్ధికగు
నాయనంతసుఖంబు ♦ నాతఁ డెం దెఱుఁగు,

నెందుండి తత్త్వమం ♦ దేమి తొలంగఁడో,
[1] తనికిన దేసిని ♦ దానికన్న మఱి
యితర మే లాభంబు ♦ నెక్కుడు గాను
భావింపఁ, డెందుండి ♦ ప్రబల దుఃఖముల
వలననేఁ గదలండో, ♦ పాటింపుదాని
వంతల కలుఁక ♦ పాపు యోగమని;
అట్టి యోగంబును, ♦ నాస్థమై వ్యథను
జెందని మనసుతోఁ, ♦ జెల్లునుగూర్చ. ౨౦–౨౩
సంకల్పభవము లౌ ♦ సర్వకామముల
నడుగంట విడనాడి, ♦ యన్నింటఁ జక్క
నిల్పి యింద్రియము ల♦న్నిమనస్సుచేన,
ధృతి గొన్నబుద్ధిచేఁ ♦ దిరముగా మనసు
నాత్మయం దమరించి, ♦ యల్లన నౌను
నుపరతిఁగనఁ! జన ♦ దొండేమి తలఁప. ౨౪, ౨౫
స్థైర్యంబు లేక చం♦చలమగు మనసు
నెందెందుఁ జనుదాని ♦ నీడ్చి యందుండి,
యాత్మయందే వశం ♦ బగును జేయంగ, ౨౬
శాంతమనస్వియు ♦ శాంతిని గొన్న
రాజసగుణుఁడును ♦ బ్రహ్మభూతుండు
నపగతకిల్బిషుం ♦ డైన యీ యోగి
శ్రేష్ఠ మైనసుఖంబు ♦ చేరును గాదె. ౨౭
ఇవ్విధంబుగ నాత్మ ♦ నెప్పుడు నిల్పి,

---

1 తనుకు = కలుగు.

సుఖముగా గతకల్మ♦షుం డైన యోగి
కొనలేని బ్రహ్మసోఁ♦కు సుకము నొందు. ౨౮
ఎల్లెడ సమముగా ♦ నీక్షించు నట్టి
యోగ యుక్తాత్ముండు ♦ యోజించు నాత్మ
నన్ని భూతమ్ముల ♦ నమరు దానిగను,
నాత్మలో భూతంబు ♦ లన్ని యున్నవిగ. ౨౯
ఎవ్వండు నన్నింట ♦ నీక్షించు నన్ను
నన్నింటిఁ గాంచు నా♦యందును మఱియు,
వానికి నే లేని ♦ వాఁడను గాను
వాఁడు నాకును లేని♦వాఁడుగాకుండు. ౩౦
అఖిలభూతంబుల ♦ యందుండు నన్ను
నేకత్వ మొంది భ♦జించు నెవ్వండు
వాఁ డన్ని విధముల ♦ వర్తించు వాఁడు
నయ్యు నాయోగి ♦ నాయందె వర్తించు ౩౧
సుఖమైన దుఃఖంబు ♦ చొప్పడ నేని
తనఁబోలె నన్నింట ♦ దరిసించు నొకటి
గా, నెవ్వఁ డా యోగి ♦ ఘనుఁ డంద్రుపార్థ. ౩౨

అర్జునుఁడు పల్కె

"సామ్యంబు నను జేసి ♦ సమకురు నట్లు,
నో కృష్ణ పల్కితే ♦ యోగంబు నీవు,
చంచలతను దీసి ♦ స్థైర్యంబుఁ గాంచ. ౩౩
చంచలము, బలము ♦ చలము గలదియుఁ,

గలఁచునది, మనసు ♦ గద కృష్ణ, దాని
గట్టుట గాలిని ♦ గట్టుట వోలె
దుష్కరంబు గదునాఁ ♦ దోఁచెడు నాకు " ౩౪

శ్రీ భగవంతుఁడు పలికె.

"నిక్కంబు మనసు దు♦ర్నిగ్రహంబు మఱి
చంచలం, బయ్యు వి♦జయ నిల్పనగును,
వైరాగ్యమునను న♦భ్యాసంబున పర ౩౫
అవునా మత మసమ్యా♦తాత్మునకొందఁ
గా నసాధ్యంబు యో♦గంబని, మనసు
స్వాధీనమయినట్టి ♦ యత్నంబు గల్గు
వానికిఁ బడయ ను♦పాయంబున నగు." ౩౬

అర్జునుఁడు పల్కె.

"కలిగియు శ్రద్ధను ♦ గడఁక లేనట్టి
యోగంబు నందుండి ♦ యుర్లిన మనసు
నున్నట్టి యాతండు ♦ యోగసంసిద్ధి
పొందక యే గతిఁ ♦ బోయెడుఁ గృష్ణ. ౩౭
భ్రష్టుఁడై రెంటికి, ♦ బ్రహ్మమార్గమున
మూఢుఁడై, యాధార♦మును లేనివాఁడు
నయి, భిన్నమేఘ మ ♦ ట్లడఁగఁడే దేవ ౩౮
ఈ నాదు శంక నో ♦ కృష్ణ, పూర్ణముగఁ
దొలఁగింపఁ దగు దీవు, ♦ దొరకఁడు గాదె
యీ శంకఁ బాపువాఁ ♦ డింక నీ కన్న" ౩౯

శ్రీ భగవంతుఁడు పల్కె.

"అతనికి నిందేని ♦ యందేని పార్థ
నాశంబు కలుగదు ; ♦ నాయనా మంచి

చేయువాఁ డెవఁడేని ♦ చెడిపోఁడు గాదె, ౪౦
యోగంబు నందుండి ♦ యురిలినవాఁడు
పుణ్యలోకంబులఁ ♦ బొంది పెక్కేండ్లు
నటనుండి శ్రీమంతు ♦ లౌ శుచులు నగు
వారల యింటను ♦ బ్రభవింపఁ గలఁడు ౪౧
కాదేని జ్ఞానంబు ♦ కలయోగుల దగు
వంశంబుననె పుట్టు ; ♦ బహుదుర్లభంబు
కద జన్మ మెద్ది లో♦కమున నిట్టి దది ౪౨
పూర్వదేహముది యా ♦ బుద్ధియోగ మటఁ
బొందును, జతనంబు ♦ పొనరించు నంత
సంసిద్ధికొఱకు వి♦జయుఁడ వెండియును ౪౩
మొదలింటి యభ్యాస♦మున దాని చేన
యవశుఁ డైయును నతం♦ డాకృష్టుఁ డగును,
యోగ మెఱుఁగు కోర్కె ♦ యున్నమాత్రమున
నతఁడు శబ్దబ్రహ్మ ♦ [1]మతకరించెడిని. ౪౪
జతనంబు కడఁకతోఁ ♦ జలుపువాఁ డగుచు
హృతకిల్బిషుఁ డయి య♦నేకజన్మములఁ
బ్రాప్తసంసిద్ధుఁ డౌ ♦ వాఁ డయి యంతఁ
బరమ మౌ పదమును ♦ బ్రాపించు యోగి ౪౫
[2]నేటు తాపసుల కం♦టెను యోగి మఱియు
జ్ఞానుల కన్నను ♦ ఘనుఁ డని యెంతుఁ,
గర్మల కన్నను ♦ ఘనుఁ డగు యోగి ;

1. అతకరించు = అతిక్రమించు 2. నేటు = శ్రేష్ఠము.

కావున యోగివి ♦ కమ్ము కౌంతేయ ౪౬
శ్రద్ధమై, నా యందు ♦ స్థాపించి మనసు
భజియించు నెవఁడు నర ♦ వాని దలంతు
యోగు లందఱసైత ♦ ముత్తముఁ డంచు" ౪౭

---

# ఏడవ అధ్యాయము

## విజ్ఞాన యోగము

---

శ్రీ భగవంతుఁడు పల్కె.

నాయందు మనసూని ♦ దన్ను బ్రాపుగాని
చలుపుచు యోగమే ♦ చాడ్పున నన్ను
సంపూర్ణముగను ని♦స్సందేహముగను
దెలియఁగాఁ గలవో కౌం♦తేయ దాని విను. ౧
ఎద్దాని నెఱిఁగిన ♦ నిటమఱి యెఱుఁగ
నగున దొండొకటి లేఁ♦దగు నట్టిది యిదె
జ్ఞానంబును సహవి♦జ్ఞానంబు గాఁగఁ
గడమ లేకుండ నేఁ ♦ గఱపెద నీకు. ౨
నరుల వేలకొలంది ♦ నరుడు నెవ్వండో
యొకరుండు సిద్ధికై ♦ యుంకించు, నట్టి
యుంకించు సిద్ధులం ♦ దొక్కఁ డెవ్వండో
యెట్లేది యున్నద♦ట్లెఱుఁగును నన్ను ౩
అనిలంబు భూమియు ♦ ననలంబు జలము
నాకసము మన స♦హంకృతి బుద్ధి

యనఁగ నాదు ప్రకృతి ♦ యయినది యిద్ది
భిన్నమౌ నెనిమిది ♦ విధములుగాను. ౪
ఇయ్యది యపరంబు ♦ నింతకన్న మఱి
యితరంబు దేనిచే ♦ నిజ్జగంబు, నర,
మోహఁగాఁ బడు, జీవ♦భూత మౌ నట్టి
నా ప్రకృతిఁ బరము ♦ నా నెఱుంగునది. ౫
సర్వభూతంబులు ♦ జన్మించు నిందు
నని యెఱుంగుము మఱి ♦ యఖిలమౌ జగముఁ
బుట్టించు వాఁడనేఁ ♦ బొలియించు వాఁడఁ ౬
నాకన్నఁ బరమునై ♦ నదియొండు లేదు
దారాన మణుల వి♦తతియట్లుఁ బార్థ
యంత యున్నదిది నా♦యందుఁ గూర్పఁబడి ౭
చంద్రార్కులను గాంతి, ♦ చవినీట, నరుల
యందుఁ బౌరుష మేను, ♦ నఖిల వేదముల
నోంకారమును, శబ్ద ♦ మువ్వరవీథి,
భువి సుగంధంబు, ని♦ప్పున వెల్గునౌదు,
నఖిలభూతంబుల ♦ నౌదు జీవనము,
నర, యౌదును దపోజ♦నంబులఁ దపము. ౮, ౯
అఖిలభూతంబుల ♦ కాదిబీజంబు
నగుదును నని నన్ను ♦ నర్జునా యెఱుఁగు
బుద్ధిమంతులయొక్క ♦ బుద్ధి నే నౌదుఁ
తేజస్వు లగువారి ♦ తేజంబు నేను ౧౦
పార్థ యౌదును బల♦వంతుల యొక్క
కామంబు రాగంబు ♦ గలియని బలము,

భూతంబులను ధర్మ♦మున కెడగాని
యట్టి కామంబును ♦ నగుదును నేను. ౧౧
సాత్త్వికము లెవి రా♦జసపు భావములు
నేవి తామసములు ♦ నెయ్యవి యగునో
నావలనివె యవి ♦ నాఁగ నెఱుంగు,
ఉండు నాలో నవి ♦ యుండనే నందు ౧౨
మూఁడు గొనంబుల ♦ పొందైన నైన
యీ భావములచేత ♦ నీ జగం బెల్ల
యగు మోహితము, వీని♦కన్నను బరము
నైనట్టి యవ్యయం బగు ♦ న న్నెఱుఁగదు. ౧౩
దైవియై నది గుణా♦త్మకమును నైన
యీ నాదు మాయను ♦ నీఁదఁ గాదు గద,
యెవరు పొందెదరు న♦న్నే శరణు వారు
చాలుదు రీ మాయ ♦ సంతరింపంగ. ౧౪
మాయచే జ్ఞానంబు ♦ మాసిన వారు
దుష్కృతుల్ మూఢు లా ♦ తుచ్ఛులు నన్ను
భజియింపరా సుర ♦ భావంబు నాని. ౧౫
ఆర్తుండు జిజ్ఞాసు ♦ వర్థార్థి జ్ఞాని
యనఁగఁ బార్థ సుకృతు ♦ లౌ నల్దెఱఁగులు
నవు జనుల్ భజియింతు ♦ రర్జునా, నన్ను. ౧౬
ఈ నలువురిలోన ♦ నేకభక్తుండు
నిత్యయుక్తుఁ డగు జ్ఞా♦ని విశిష్టుఁ డగును;
అట్టి జ్ఞానికి నేను ♦ నత్యంతముగను
బ్రియుఁడ, వాఁడును నాకుఁ ♦ బ్రియుఁడును గాదె. ౧౭

ఎల్లవారు నుదారు ♦ లే వీరు, నైన,
జ్ఞానియో నేనెయౌ ♦ నా నాదు మతము,
యుక్తాత్ముఁ డై వాఁడు ♦ నొక్కని నన్నె
యుత్కృష్ట గతినిగా ♦ నొందియుండుఁ గద
పెక్కులౌ జన్మముల ♦ వెనుక జ్ఞాని యయి
వాసుదేవుండె స♦ర్వంబు నా నన్ను
గొలుచు, నరిది కలు♦గుట యట్టిఘనుఁడు. ౧౯
తమ తమ ప్రకృతిచే♦త నియమింపఁబడి
అల కోర్కులను జ్ఞాన ♦ మడఁగిన వారు
నయి యయ్యయి నియతు ♦ లౌని యితరులు
నగునట్టి వేల్పుల ♦ నాశ్రయించెదరు. ౨౦
ఎవ్వఁ డెవ్వండు నే ♦ యే రూపమునను
భక్తుఁ డై శ్రద్ధమై ♦ భజియింపఁ గోరు
నతని యా శ్రద్ధనే ♦ యచలంబు సేతు. ౨౧
అలశ్రద్ధతో వాఁడు ♦ నంటిన వాఁడు
నై కోరు వారినే ♦ యర్చింపఁ గాను,
నాచేతనే విని♦ర్ణయము లైన యల
కోరికల్ వారిచే ♦ గొనియెడుఁ గాదె. ౨౨
దేవులం గొల్చువార్ ♦ దేవులం గంద్రు,
స్వల్పంబు నగునట్టి ♦ జ్ఞానంబు గలుగు
వారి యాఫలము న♦శ్వరము నైన దగు,
నన్ను గొల్చెడి వారు ♦ నన్నె పొందెదరు. ౨౩
మేలైన తఱుఁగని ♦ మేటిలేనట్టి

నా తీ రెఱుఁగని య♦జ్ఞానులు నన్ను
నవ్యక్తు, వ్యక్తిఁ గొ♦న్నట్టు లెంచెదరు. ౨౪
ఎల్లవారల కేను ♦ నెఱుఁగఁగా రాను,
అగుటచే యోగమా ♦ యాసమావృతుఁడ,
నన్ను వివేకశూ♦న్య మగు నీ జగము
నజునిగాను నెఱుఁగ ♦ దవ్యయునిగను. ౨౫
కడచిన వున్నవి ♦ కాఁగలవైన
భూతంబు లెఱుక య♦వును బార్థ, నాకు
ఎఱుఁగఁడు న న్నెవ్వఁ ♦ డేనియుఁ గాని. ౨౬
ద్వేషేచ్ఛలను గల్గు ♦ ద్వితయమోహమున
సర్వభూతమ్ములు ♦ జననకాలంబు
నందు సమ్మోహంబు ♦ నందెడు విజయ. ౨౭
పుణ్యకర్ములది యే ♦ పురుషులది యగు
పాపంబు తుదఁగొను, ♦ ద్వంద్వముక్తు లయి
భజియింత్రు వార్ దృఢ♦వ్రతు లయి నను. ౨౮
ముదిమిని జావును ♦ బోఁగొట్టుకొనఁగ
నను జేరి యెవరు మొ♦నయుదురు వారు
నధ్యాత్మమంతయు ♦ నఖిలకర్మమును
గ్రహియింత్రు వారల్ల ♦ బ్రహ్మంబుఁ గూడ. ౨౯
అధిభూత మధిదైవ ♦ మధియజ్ఞములను
గూడిన య ట్లెఱుం ♦ గుదురు న న్నెవరు
యతమనస్కు లయి వా ♦ రంతకాలమునను
గూడను నుందురు ♦ గుఱుతెఱింగి నను. ౩౦



# ఎనిమిదవ అధ్యాయము

## అక్షరపరబ్రహ్మయోగము

అర్జునుఁడు పల్కె.

ఆ బ్రహ్మమేది య♦ధ్యాత్మ మెట్టియది
ఏది కర్మ మధిభూత ♦ మెయ్యది యంద్రు
అధిదైవ మెయ్యది ♦ యందురు కృష్ణ, ౧
ఎవఁ డెట్టు లధి యజ్ఞుఁ ♦ డీ దేహమందు,
నం దెట్లు హరి నియ♦తాత్ములచేత
నేగు కాలమునను ♦ నెఱుఁగ నయ్యెదవు ౨

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఔ బ్రహ్మము పరమ ♦ మౌ నక్షరంబు,
అధ్యాత్మ మనఁబడు ♦ నది స్వభావంబు,
భూతభావంబులఁ ♦ బొడమించు నద్ది
యగు విసర్గముకర్మ ♦ మనఁగను బరఁగు 3
అధిభూత మన నర ♦ యంతవంత మగు
నట్టిది, పురుషుండు ♦ నధి దైవతుండు
నధియజ్ఞుఁ డీ దేహ♦మందే నే యగుదు ౪
చచ్చునప్పుడు నన్నె ♦ స్మరియించు చెవఁడు
నేగు దేహంబు త్య♦జించి వాఁ డొందు
నా భావము ననుమా♦నంబు లే దిందు ౫
ఏదేది భావంబు ♦ నెంచుచుఁ దుదను

సంగంబు విడు, నెప్పు♦డల్ల భావంబె
కలుగంగ, దానినే ♦ కాంచును పార్థ. ౬
సతతంబు కావున ♦ స్మరియింపు నన్ను
పోరను జలుపుము ♦ బుద్ధియు మనము
నాయందుఁ బాదుకొ♦న్న యతండవు నయి
నిక్కంబుగా నన్నె ♦ నీవు పొందెదవు. ౭
అభ్యాసయోగంబు ♦ నానిన దొందుఁ
జేరని చిత్తంబు♦చేఁ దలంచుచును
బరమపురుషు దివ్యుఁ ♦ బ్రాపించుఁ బార్థ. ౮
భక్తియుక్తుఁ డయి యె♦వ్వండు, కడచను
కాలంబునందు యో♦గబలంబుచేన
తొలఁగనట్టి మనస్సు♦తోఁ జక్క నసువు
భ్రూమధ్యమున నిల్పి ♦ పూర్వుండు కవియు
నఖిల నిర్మాతయు ♦ నణువులలోన
నణువును నిర్ణేత ♦ యగు తలంపంగ
రానిరూపము వాని ♦ రవివన్నె వాని
ధ్వాంతంబు దాఁటిన ♦ పరమ పూరుషుని,
భావించు నాతండు ♦ పడయు నా దివ్య. ౯, ౧౦
అంద్రు వేదజ్ఞు లే ♦ దక్షరం బనుచు,
నేదాని రాగర♦హితు లైన యతులు
[1]కూర్కొందు, రెద్దాని ♦ గోరిన వారు

1. కూర్కొందురు = ప్రవేశింతురు.

బ్రహ్మచర్యంబున ♦ వర్తింతు, రట్టి
పదము సంగ్రహముగా ♦ వచియింతు నీకు. ౧౧
ద్వారంబు లన్నింటి ♦ బంధించి లెస్స
మ దెద నిడి తలకుం ♦ దనదు ప్రాణంబు
రప్పించి యోగధా♦రణమును బొంది. ౧౨
ఓ మ్మను బ్రహ్మమౌ ♦ నొక్క యక్షరము
నుడువుచును స్మరియిం♦చుచు నన్ను, నొడలు
[2]నెడయుచు నెవఁడు పో♦యెడు, నట్టి వాఁడు
పరమ మైన గతిని ♦ బ్రాపింపఁ గలఁడు. ౧౩
ఇతరంబుపై మనం ♦ బేగని వాఁడు
నై నిత్యయుక్తుండు ♦ నై యనుదినము
నెవఁడు నన్ స్మరియించు ♦ నెప్పుడు పార్థ
అట్టి యోగికి నేను ♦ నౌదు సులభుఁడ. ౧౪
పరమ మౌ సంసిద్ధిఁ ♦ బడసిన యట్టి
వారౌ మహాత్ములు ♦ ప్రాపించి నన్ను,
నస్థిరమైన దుః♦ఖాలయ మైన
యట్టి జన్మంబును ♦ నందరు తిరిగి. ౧౫
కౌంతేయ బ్రహ్మలో♦కంబుతోఁ గూడ
నిఖిలలోకంబులు ♦ న్దిరిగి వచ్చునవె,
నర, లేదు నను బొంది♦నన్ బునర్భవము. ౧౬
పగలు రే లెఱిఁగిన ♦ వారు, బ్రహ్మదగు
పవ లెద్ది యయ్యది ♦ పదినూఱ్ యుగములు

2. ఎడయు = ఉజ్జగించు.

గలదని, రాత్రి యు♦గములు వేయింటఁ
గలయట్టి దనియును ♦ గనుఁగొనియెదరు, ౧౭
పగలు రాఁ గలుగు న♦వ్యక్తంబువలన
వ్యక్తముల్ సర్వముల్, ♦ వచ్చుడు రాత్రి
యడఁగు నా యవ్యక్త ♦ మను దానియందె. ౧౮
విజయ, యీ యీ భూత♦వితతె యవశము
గాఁ బుట్టి పుట్టియుఁ ♦ గడచను చుండు
రాత్రి రాఁ, బగలు రాఁ ♦ బ్రభవంబు నొందు. ౧౯
అల్ల యవ్యక్తంబు ♦ కన్న నన్యంబు
నైన యవ్యక్తంబు ♦ నాది లేనిదియు
నగు భావ మే దది, ♦ యఖిలభూతములు
నశియించుచుండంగ ♦ నశియించి పోదు ౨౦
అక్షరం బవ్యక్త ♦ మనఁగను బరఁగుఁ,
బరమ మా గతి యని ♦ వచియింత్రు దాని,
దేనిని బొందినఁ ♦ దిరిగి రా, రట్టి
పరమ మా నట్టి యా ♦ పదమగు నాది. ౨౧
ఎవనిలో భూతంబు ♦ లిరవొంది యుండు,
నెవనిచే వ్యాప్తమా ♦ నియ్యది యంత,
ఆ పరమపురుషుఁ ♦ డన్యముండనిది
యా భక్తిచేఁ బార్థ, ♦ యాను లభ్యుండు. ౨౨
ఏ కాలమున యోగు ♦ లేగినఁ దిరిగి
వచ్చెద రెపుడు పో♦వ మరల రారొ
యట్టి కాలంబు నో ♦ యర్జునా, వినుతు. ౨౩
అగ్నియు జ్యోతి యు♦హస్సు శుద్ధంబు

నాఱు మాసము లు త్త♦రాయణం బందుఁ
బ్రాణంబు విడిచెడి ♦ బ్రహ్మజ్ఞు లైన
వారలు బ్రహ్మంబుఁ ♦ బ్రాపింపఁ గలరు. ౨౪
తుది యర్ధమాసంబుఁ ♦ ధూమంబు రాత్రి
యందును దక్షిణా♦యన మాఱునెలల
యోగి యిందు జ్యోతి ♦ నొంది వచ్చెడిని, ౨౫
సిత మసితము లివి ♦ స్థిరమైన రెండు
గతులు జగమునకుఁ ♦ గదయంచు నెంతు,
నొకట ననావృత్తి ♦ నొందు నన్యంబు
వలన నేతెంచుట ♦ వాటిల్లుఁ దిరిగి ౨౬
ఈ రెండుమార్గంబు ♦ లెఱిఁగిన యోగి
యెవ్వఁ డేనియు మోహ ♦ మెనయండు పార్థ,
కావునను సకల ♦ కాలంబులందుఁ
గుంతీజ యోగయు♦క్తుండవు కమ్ము. ౨౭
ఏ పుణ్యఫలము వ♦చింపఁగాఁ బడియె
యజ్ఞంబులఁ దపము♦లందు వేదముల
నీవు లందును గూడ, ♦ నియ్య దెఱింగి,
దానినినంతయు ♦ దాఁటును యోగి
యాద్యంబు పరమంబు ♦ నగుస్థాన మొందు. ౨౮

# తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్యయోగము.

### శ్రీ భగవంతుఁడు పల్కె.

అశుభంబువలన నె♦య్యె డెఱుంగ, విడువఁ
బడుదు వట్టిదియును ♦ బహురహస్య మిదె
జ్ఞానంబు విజ్ఞాన♦సహిత మౌ దాని
నుగ్గడింతు నసూయ ♦ నొందని నీకు. ౧
రాజవిద్యయు నిద్ది ♦ రాజగుహ్యంబు
ధర్మ్య ముత్తమము ప్ర♦త్యక్షావగమము
శుద్ధ మవ్యయము సు♦సుఖ మాచరింప. ౨
ఈ ధర్మమున శ్రద్ధ ♦ యొనయని నరులు
మరణయుక్త మగు సం♦సారమార్గమున
మగుడ వత్తురు ననుం ♦ బ్రాపింపక నర. ౩
అఖిల మౌ నీజగం ♦ బవ్యక్తమూర్తి
యయిన నాచేఁ దతంబ♦గును నా యందు
నిఖలభూతము లుండు ♦ నే వాని యందుఁ
గా నున్న వానిని, ♦ గావు భూతములు
నాయందు నున్నవి; ♦ నాదు మేటిదగు
కూరుపునుం గనుఁ♦గొను, భూతములను
బొడమించు నా యాత్మ ♦ భూతము లందు
నిరవొందదు మఱి భ♦రించు భూతముల ౪,౫
అంతటఁ జరియించు ♦ నది విపులంబు

నగు వాయు వాకాశ♦మం దెప్పు డుండు
నట్లు నాయం దుండు ♦ నన్ని భూతములు
నా నెఱుంగుము పార్థ, ♦ నాదు ప్రకృతిని
భూతంబు లన్నియుఁ ♦ బొందుఁ బ్రలయము
కాలమందును, సృష్టి ♦ కాలంబునందుఁ
గ్రమ్మఱ వానిని ♦ గలిగింతు నేను ౬, ౭
అస్వతంత్ర మగు నీ ♦ యఖిలభూతముల
ప్రతతిఁ బొరింబొరిఁ ♦ బ్రకృతివశముగఁ
బుట్టించెదను నేను ♦ బూని నా ప్రకృతి. ౮
ఆసక్తి కల్గక ♦ యా కర్మములను
దగులము లేని యా♦తని యట్లు లుండు
నన్ను నా కర్మముల్ ♦ నర, కట్టఁ గావు ౯
అర్జునా యధ్యక్షుఁ ♦ డైన నాచేతఁ
బ్రకృత చరము నచ♦రంబును గాంచు.
వర్తించు జగము బల్ ♦ వగల నీ కతన ౧౦
భూతమహేశ్వరం♦బు నయిన నాదు
పరమభావంబు నే♦ర్వని మూఢులు నరు
వపువు దాల్చిన న న్నవజ్ఞ సల్పెదరు. ౧౧
రిత్త కోర్కులవారు ♦ రిత్తచెయ్దముల
వారు రిత్తతెలివి ♦ వారు పాలసులు
రాక్షసంబును నాసు♦రంబు మోహంబు
నందించు ప్రకృతినే యాశ్రయించెదరు. ౧౨
దివ్యమా ప్రకృతిఁ బొం♦దినయట్టి వారు

నా ఘనులొా నను భూ♦తాదిముఁ గొల్తురి,
ఎద నన్నె మెన్నక, ♦ యొకరిగ యవ్యయుఁగ ౧౩
యతమానులు నను ని♦త్యంబును గీర్తి
పచరించు వారల్ స్థిర♦వ్రతులును భక్తి
నెపుడు యుక్తులును న♦యినవారు నన్నుఁ
బ్రణమిల్లువారునై ♦ భజియించు వారు. ౧౪
విశ్వరూపుఁ డగు న♦న్వేఱొండు వారు
జ్ఞానయజ్ఞమున బూ♦జనము సేయుచును
వేఱు వేఱనియును ♦ బెక్కండ్రు ననియు
నొక్కండె యనియును ♦ నొనరింత్రు సేవ. ౧౫
ఏ యజ్ఞ మేఁ గ్రతు ♦ వే స్వధ నేనె
యాజ్య మేనే యగ్ని ♦ నౌషధం బేనె
యేనె హుతంబును ♦ నేనె మంత్రంబు ౧౬
ఏను దండ్రియుఁ దల్లి ♦ నీ జగంబునకుఁ
దాతయు ధాత వే♦ద్యంబుఁ బావనము
మఱియును బుక్కును ♦ బ్రణవమ్ముఁ గూడ
సామంబును యజుస్సు ♦ సాక్షియు గతియు
భర్త నివాసంబు ♦ ప్రభువు సుహృత్తు
శరణంబుఁ బ్రభవంబు ♦ స్థానంబు లయము
సమసి పోనట్టి బీ♦జము నిధానంబు ౧౭, ౧౮
నే నెండఁ జేయుదు, నేను వర్షంబుఁ
గురిపింతు నిలుపుదుఁ గూడ నేఁ బార్థ
సత్తు నసత్తును ♦ జావు నమృతము. ౧౯

యజ్ఞంబులను నన్ను ♦ నర్చించి యాని
సోమపానంబుల ♦ ప్యూతపాపులు తిగ
ప్రాఁజదువుల వారు ♦ స్వర్గలోకమును
బొందఁ గోరెదరు, వార్ ♦ పుణ్య మౌ నట్టి
స్వర్లోకమును బొంది ♦ స్వర్గంబు నందుఁ
దినెదరు దివ్య మౌ ♦ దేవభోగముల ౨౦
వారా విశాల మౌ ♦ స్వర్గలోకంబు
ననుభవించియుఁ బుణ్య ♦ మంత మందంగఁ
బొందెదర్ నరలోక♦ముఁ, దొలిపలుకుల
[1]పాటి నానెడు వారు ♦ వలపుల వలపుఁ
గలవారు రాకపో♦కలఁ గందురిట్లు. ౨౧
ఎవరు వే ఱొండుఁ జిం♦తింపక నన్ను
నారఁ గొల్తురల ని♦త్యాభియుక్తులవి
యోగంబు క్షేమంబు ♦ నూనుదు నేను ౨౨
ఇతర దేవతలందు ♦ నెవ్వారు భక్తిఁ
గూడియు శ్రద్ధతోఁ ♦ గొలిచెద రట్టి
వారును నవిధిపూ♦ర్వకముగ నన్నె
కొలుచు వారౌదురు ♦ కుంతీతనూజ. ౨౩
అఖిలయజ్ఞంబుల ♦ కగుదుఁగా నేనె
ప్రభుఁడ భోక్తయును, ద♦త్త్వంబుగా నన్ను
వా రెఱుఁగరు, గానఁ ♦ బడెదరు గాదె. ౨౪
వేల్పులం గొల్చువార్ ♦ వేల్పులం గంద్రు,
పితరులం గొల్చువార్ ♦ పితరులం గంద్రు,

1. పాటి = ప్రమాణము.

భూతముల్ గొల్చువార్ ♦ భూతముల్ గాంత్రు,
నను గొల్చువారును ♦ నన్నె కాంచెదరు. ౨౫
పత్రంబొ పుష్పంబొ ♦ ఫలమొ తోయంబొ
యెవ్వండు భక్తితో ♦ నిచ్చును నాకు
నట్టి శుద్ధాత్ముండు ♦ నర్మిలితోడ
నర్పించు దాని నే ♦ ననుభవించెదను. ౨౬
ఎయ్యది యొనరింతు, ♦ వెద్ది కుడుతువొ,
హోమ మెయ్యది సేతు♦వో, యొసంగెదవొ
యెయ్యది, సల్పెద♦వే తపం, బద్ది
యర్జునా సల్పు నా ♦ కర్పణంబుగను. ౨౭
కష్టసుఖంబులఁ ♦ గలిగించు నట్టి
కర్మబంధంబులఁ ♦ గడచెద విట్లు,
సన్న్యాసయోగ మె♦సంగిన యాత్మ
ముక్తుండ వై నన్నుఁ ♦ బొందెద వీవు. ౨౮
అఖిలభూతంబుల♦యందు నే సముఁడ,
లేఁడు నాకుఁ బ్రియుండు ♦ లేఁడు, ద్వేష్యుండు,
భక్తితో నెవరు న ♦ న్భజియింత్రు వారి
యందేను నుందు నా♦యందుఁ వా రుంద్రు. ౨౯
అధికదురాచారుఁ ♦ డగు నేనియు ననుఁ
గొలుచు నే నన్యంబుఁ ♦ గొలువక, వాఁడు
లెస్సగా మనసు ని♦ల్పినవాఁడు గాడె,
వాని శ్రేష్ఠుఁడె యని ♦ భావింపఁ దగును. 30
అతఁడు వే ధర్మాత్ముఁ ♦ డగు, స్థిర మైన

నొండొరుల్ బోధన ♦ మొనరించు కొనుచు
నాకథనంబులఁ ♦ వాకొను చుంద్రు,
ఎప్పుడు తుష్టులును గ్రీ♦డించు చుండెదరు. ౯
ఎప్పుడు యుక్తు లై♦యి ప్రియముతోడ
భజియించు వారికి ♦ వారు దేన నను
నొందుదు రా బుద్ధి ♦ యోగంబు నిత్తు ౧౦
దయచేస వారి యా♦త్మలయందు నిలిచి
యజ్ఞానమునఁ గల్గు ♦ నట్టి తమంబు,
భాషించు జ్ఞానదీ♦పమున నే నడఁతు ౧౧

అర్జునుఁడు పల్కె.

పరమ మా బ్రహ్మంబు ♦ పరమధామంబు
పురుషుండును బరమ♦పూతుండవీవు
నిత్యుండ వనియును ♦ దివ్యుండ వనియు
నాదిదేవుం డని ♦ యజుఁ డని విభుఁడ
వని నిన్ను వ్యాసుండు ♦ నసితుండు మఱియు
నాకర్షి యైనట్టి ♦ నారదుండు ఋషు
లందఱు దేవలుం ♦ డందురు, నీవు
గూడ నాతోడ వా ♦ క్రుచ్చెద వట్లు. ౧౨, ౧౩
ఈవు నాతోఁ బల్కె♦డెద్దిది యెల్లఁ
దథ్యం బటంచును ♦ దలఁచెదఁ గృష్ణ.
దేవ నీవ్యక్తిని ♦ దేవతలేని
యును దానవులు నేని♦యును గనరు గద. ౧౪

దేవదేవ, జగత్ప♦తి, పురుషోత్తముఁడ,
భూతమహేశ్వర, ♦ భూతభావనుఁడ,
స్వయముగా నీ స్వరూ♦ప మెఱిఁగె దీవ. ౧౫
నీదు విభూతులు ♦ న్దివ్యంబులు గద,
యే విభూతులచేత ♦ నీ లోక మీవు
వ్యాపించి యున్నావొ ♦ వానిని గొఱఁత
గలుగక వచియింపఁ♦గా నర్హుఁడవుదు. ౧౬
ఎపుడు నిన్నెన్ని చిం♦తించుచు యోగి,
యే నిన్ను నెఱిఁగెద ♦ నెట్లు? స్వామి, నిను
నేఁ దలఁపనగు నే ♦ యే భావములను? ౧౭
నీ యోగము విభూతి♦ని విపులంబుగను
వచియింపుము మరల ♦ స్వామి, యమృతము
వినునట్టి నాకుఁ దృ♦ప్తి కలుగదు గద. ౧౮

శ్రీ భగవంతుఁడు పల్కె.

నే నీకుఁ జెప్పెద ♦ న్దివ్యంబులైన
ముఖ్యంబు లగు నా వి♦భూతుల నింక,
గడలేదు వివరింపఁ ♦ గద పార్థ, నాకు. ౧౯
నిఖిలభూతంబుల ♦ నెలకొనియుండు
నాత్మ నేనే యాదు ♦ నర్జునా, నేనె
యాదు భూతముల మ♦ధ్యాంతంబు లాది. ౨౦
ఆదిత్యులందేను ♦ నవుదు విష్ణువును,
నవుదు వెలుంగులం♦దంశుమంతుండు
నగు రవిని, మరుత్తు♦లందు మరీచిఁ,
జంద్రుఁడే నగుదు న♦క్షత్రంబులందు. ౨౧

వేదంబులను సామ♦వేదంబు నౌదు,
నేను దేవతలందు ♦ నింద్రుండ నౌదు,
నింద్రియంబులయందు ♦ నే నౌదు మనసు,
నవుదు భూతంబుల♦యందుఁ జేతనము. ౨౨
రుద్రులందును శంక♦రుండను నౌదు,
యక్షరాక్షసులందు ♦ నవుదుఁ ధనదుఁడ,
వసువులయందును ♦ బావకుం డౌదు,
శిఖరులందును మేరు♦శిఖరిని నేను. ౨౩
అవుదుఁ బురోధసు♦లందు ముఖ్యుండు
నగు బృహస్పతి యని ♦ యర్జునా, యెఱుఁగు,
అగుదు సేనానుల♦యందు స్కందుండ,
నగుదు సరస్సుల ♦ యందు సాగరుఁడ. ౨౪
అవుదును భృగువు మ♦హర్షుల యందుఁ,
బదములయం దేను ♦ బ్రణవంబు నౌదు,
యజ్ఞంబులను జప♦యజ్ఞంబు నౌదు,
స్థావరంబుల హిమా♦చలమును నౌదు. ౨౫
నాకర్షులందును ♦ నారదుండ, మఱి
యవుదును సిద్ధుల♦యందును నేను
గపిలుఁ డనుముని, ♦ గంధర్వులందుఁ
జిత్రరథుఁడ, నెల్ల♦చెట్టుల రావి. ౨౬
అశ్వంబులందున ♦ నమృతంబు లోన
జన్మించినట్టి యు♦చ్చైశ్రవం బేను,
హస్తీంద్రములయందు ♦ నైరావతంబు,
నరులందు రాజుఁగా ♦ నన్నెఱుంగునది. ౨౭

ఆయుధంబుల వజ్ర♦మవు దేఁ, బ్రజనుఁడు
నైన కందర్పుఁడ, ♦ నాలవేలుపుల
పసి నౌదుఁ, బాముల ♦ వాసుకి నేను. ౨౮
అవుదును నాగంబు♦లం దనంతుండ,
యాదసులందును ♦ నౌదు వరుణుఁడ,
నర్యముండఁ బితరు♦లందును నౌదు,
యముఁడ నియామకు♦లందు నే నౌదు. ౨౯
అవుదు దైత్యులను బ్ర♦హ్లాదుండ నేను,
గాలంబు నౌదు లె♦క్కసలుపు వారి
యం, దేను మృగముల ♦ యందు సింహంబు,
పక్షులయం దౌదు ♦ వైనతేయుండ. 3౦
ప్రసరించువానిలోఁ ♦ బవనుండ నేను
రాముఁడ నేను శ♦స్త్రధరుల యందు,
మత్స్యంబులం దౌదు ♦ మకరంబు నేను,
నదులలోపలను జా♦హ్నవి నౌదు నేను. 3౧
ఆదిమధ్యాంతంబ ♦ యౌదు సృష్టులకు,
విద్యల నధ్యాత్మ♦విద్యను బార్థ,
వాదులయం దేను ♦ వాదంబు నౌదు. 3౨
ఔదు నకారంబు ♦ నక్షరంబులను,
మఱియు ద్వంద్వమును స♦మాసంబు లందు,
నక్షయం బగు కాల ♦ మౌదును నేనె,
యెల్లమోములవాఁ డ♦యినధాత నేను. 33
ఏ సర్వము హరించు ♦ మృత్యువు నౌదుఁ,
బుట్టువు నేఁ బుట్టఁ♦బోవు వానికిని,

స్త్రీలయందు ధృతియు ♦ శ్రీయును గీర్తి
మేధయు క్షమయును ♦ స్మృతియును వాక్కు. ౩౪
సామంబులను బృహ♦త్సామంబు నేను,
నవుదు ఛందముల గా♦యత్రిని నట్లే,
మాసంబులం దేను ♦ మార్గశీర్షంబు,
ఋతువులయం దౌదు ♦ నే వసంతంబు. ౩౫
ద్యూతంబు నే నగు♦దును వంచకులను,
తేజస్వులందు నేఁ ♦ దేజంబు నౌదు.
జయమౌదు నే వ్యవ♦సాయంబు నౌదు,
సాత్త్వికులకు నౌదు ♦ సత్త్వంబు నేను. ౩౬
వాసుదేవుఁడ వృష్ణి ♦ వంశ్యుల నౌదుఁ,
బాండవులందును ♦ బార్థుండ నేను,
వ్యాసుండ మునులలో♦పల నేను మఱియుఁ,
గవులలోన నుశనా♦కవియును నేను ౩౭
నేను దండమవుదు ♦ న్నిగ్రహకులయందు,
నవుదు జిగీషుల♦యందు నీతియును,
గుహ్యంబులందు న♦గుదును మౌనంబె,
జ్ఞానులయందును ♦ జ్ఞానంబు నేను. ౩౮
సర్వభూతముల బీ♦జం బేది గలదో
యదియు నే నౌదు చ♦రాచరం బైన
యట్టి భూతం బెద్ది ♦ యగును నాచేతఁ
గానిది యట్టిది ♦ కౌంతేయ, లేదు ౩౯
నాదు దివ్యంబులై♦న విభూతులకును
బాసఁగదు తుద; యీ వి♦భూతి విస్తరము

పార్థ సంగ్రహముగఁ ♦ బల్కితి నేను. ౪౦
ఏది శ్రీమంతంబు ♦ నేది యూర్జితము
నైశ్వర్యయుక్తంబు ♦ నౌ సత్త్వ మేది
రేది యున్నది యది ♦ యెల్లను నాదు
తేజోంశజంబని ♦ తెలిసికో పార్థ ౪౧
ఇఁక నీ విరివియైన ♦ *యెఱుకతో నీకు
నేల యీ జగమంత ♦ నేకాంశమునను
నెక్కొల్పి యున్నాఁడ ♦ నేను గౌంతేయ ౪౨

# పదునొకొండవ అధ్యాయము.

## విశ్వరూపసందర్శనయోగము.

అర్జునుఁడు పల్కె.

నను గరుణింపఁగా ♦ పరమమైనదియు
నాధ్యాత్మికంబు గు ♦ హ్యమగు నే వాక్య
నిగదితం బయ్యెనో ♦ నీచేతదాన
నాది యీ మోహంబు ♦ నాశంబు నొందె ౧
భూతసంభవలయం ♦ బులను నీ వలన
విరివిగ దేవ, నే ♦ వింటిఁగా నీదు
నవ్యయం బైన మా ♦ హాత్మ్యంబుఁ గూడ, ౨
ఎట్లని పల్కితి ♦ వీవు ని న్నద్ది
పరమేశ, యిట్టిదే, ♦ పరమాత్మ, నీది
యైశ్వరమౌ రూపు ♦ నాశింతుఁ జూడ. 3

* పాఠాంతరములు, ౧ కిం జ్ఞానేన. ౨ కిం జ్ఞాతేన.

స్వామి, నాచేఁ గాంచఁ ♦ బడ నౌ నదియని
యెంచెదవేని యో♦గేశ్వర, నాకు
నంతఁ జూపింపు మ♦వ్యయమగు నిన్ను ౪

శ్రీ భగవంతుఁడు పల్కె.

పలురంగు రూపుల ♦ పలుతెఱంగులవి
యైనట్టి దివ్యంబు ♦ లైన నూర్ వేలు
నగు నాదురూపంబు ♦ లర్జున, కనుమ ౫
ఆదిత్యవసుప్తుల ♦ నశ్వినుల నర,
రుద్రులం జూడు మ♦రుత్తులం, బెక్కు
మును గననట్టి య♦బ్బురములనంత ౬
సచరాచర మఖిల♦జగముఁ జూడు నర,
యిఁక నేమిఁ గాంచఁగా ♦ విచ్చగింతు వేది
యిపుడు నాదేహమం♦దిట నొక్కటిదిగ. ౭
ఈ నీదు కన్నున♦నే నన్నుఁ జూడఁ
జాలవు గాన నొ♦సంగెద నీకు
దివ్యచక్షువును నా♦ది యగు యోగంబు
నైశ్వర్యంబును నైన ♦ యది కనుఁ గొనుమ, ౮

సంజయుండుపల్కె

హరి మహాయోగేశుఁ ♦ డని యిట్లు రాజ,
యంతఁ గనుపఱచె ♦ నర్జునునకయి
యైశ్వర్యంబుఁ బరమ ♦ మైనరూపంబు ౯
పలుమోము కనులది ♦ పలుమేల్ నగలది

పెక్కులునైనట్టి ♦ వింతచూపులది
తిగిచినట్టి యనేక ♦ దివ్యాస్త్రములది ౧౦
మేలి పుట్టములది ♦ మేలిదండలది
మేలైన గంధంపు ♦ మెయి పూఁతఁ గలది
తుదలేని యది విశ్వ♦తోముఖంబు మఱి
యఖిల మాశ్చర్యమ♦యు మవు దైవంబు. ౧౧
ఆకాశమందు సూ♦ర్యసహస్రము దగు
కాంతియు నొక్కటం ♦ గలిగెనే నద్ది
యా మహాత్ముని వెల్గు ♦ కౌను సదృశము. ౧౨
దేవదేవునియొక్క ♦ దేహంబునందు
నచట నొక్కటనున్న ♦ యఖిలజగంబుఁ
బెక్కు తెఱంగుల ♦ వేర్వేఱు గాను
నైన దానిని గాంచె ♦ నంతఁ బార్థుండు ౧౩
అంత విస్మయ మంది ♦ యా పార్థుఁ డొడలు
పులకరింపంగ దే♦వుఁ దలతో మ్రొక్కి
యనియెను హస్తద్వ♦యంబును మోడ్చి ౧౪

అర్జునుఁడు పల్కె.

దేవ కాంచెదు నీదు ♦ దేహంబునందు
భూతవిశేష స♦మూహంబుల, మఱి
సర్వదేవతల, నీ♦శ్వరుఁ డగువానిఁ
బద్మాసనస్థుని ♦ బ్రహ్మను మఱియు
నిఖిలఋషుల నిఁక♦న్దివ్య సర్పముల ౧౫
మోముల్ గనుల్ కేలు ♦ బొజ్జలు పెక్కు

కలవాని నన్ని ప్రక్కలఁ దుది లేని
[1]అడవానిగ నిను విశ్వాధిప, కాంచు
వాఁడను విశ్వరూప, మఱియు నీకు
మొదలును దుది నడుమును గనుగొనను. ౧౬
గదిని కిరీటిఁ జక్రధరు నంతటను
వెల్గు వానిని జూడ నెవ్వు గా నట్టి
వానిఁ దేజోరాశి భాసించు నట్టి
సూర్యాగ్ని తేజు నెంచుటకు సాధ్యంబు
గాని వానిగ, నిన్నుఁ గాంతు నెల్లెడల. ౧౭
పరముఁడ వెఱుఁగఁగా వలయు వాఁడవును,
నీ వక్షరుండవు, నీ విశ్వమునకుఁ
బరమనిధాన, మవ్యయుఁడవు నీవు,
పురుషుండ వగుదువీవు సనాతనుఁ డవు,
శాశ్వత ధర్మరక్షకుఁ డని తలఁతు. ౧౮
మొదలును తుది నడుమును లేనివానిఁ
గడలేని బీరంబు గలిగినవాని
లెక్క లే కున్న కేల్ నెక్కొన్నవాని
నెలప్రొద్దు కన్నులు నెలకొన్నవాని
వెలుఁగొందు నగ్గివా బెరసినవాని
నీ జగముఁ దనవె ల్గేర్చెడు వాని
గాఁగను నే నిన్ను గాంచుచున్నాఁడ. ౧౯
ఈ భూనభోంతరం బెల్ల కడలును

---

1. అడ = ఆకృతి.

నీ యొక్కనివలన ♦ నిండఁబడెఁగద!
అద్భుతంబును నుగ్ర♦మైన యీ నీదు
సాకారము గని మ♦హాత్మ, లోకములు
మూఁడు భయంబును ♦ బొందుచున్నయవి. ౨౦
చొచ్చుచున్నార లీ ♦ సురతతుల్ నిన్ను,
కొందఱు భీతు లై ♦ కూర్చి కేలు
వర్ణించు చున్నారు, ♦ స్వస్తి యటంచుఁ
బుష్కల స్తవములఁ ♦ బొగడుచున్నారు
నిన్ను సిద్ధమహర్షి ♦ నికరంబులు గద. ౨౧
ఆదిత్యరుద్రులు ♦ యక్షు లసురులు
పితరుల్ వసువులు వి♦శ్వేదేవతలును
సిద్ధగంధర్వు ల♦శ్వినులు వాయువులు
సాధ్యులు ననువారి ♦ సంఘంబు లెల్ల
వీక్షించు నిన్ను ని♦వ్వెఱపాటు తోనె. ౨౨
పెక్కు మోములు కనుల్ ♦ పెక్కు బొజ్జలది
కాళుల్ దొడల్ కేలు ♦ గలది పెక్కింటఁ
బెక్కు కోఱలచేత ♦ బెడిదమైన యది
నై ప్రబలంబును ♦ నైనట్టి నీదు
రూపంబుఁ గనుఁగొని ♦ బ్రుంగెడు భీతి
లోకముల్ నేను న♦ట్లు నయితి శూర. ౨౩
నభమంటి దీప్త, నా♦నావర్ణములను
గలిగి వ్యాప్తాస్యంబుఁ ♦ గలిగి జ్వలించు
నిడుదకన్నులు నున్న ♦ నిన్ను గాంచి హరి

మైత్రిఁ బ్రవ్యథితాంత ♦ రాత్ముండ నాకు
ధైర్యంబు శమమును ♦ దక్కవు గాదె! ౨౪
కాలాగ్ని తుల్యముల ♦ గాఁగ, దంష్ట్రలను
భయదంబు లౌ నీదు ♦ వక్త్రముల్ గాంచి
యెఱుఁగఁగా! దెసలు, ల♦భింపదు సుఖము;
దయఁ జూపు దేవనా♦థ, జగన్ని వాస. ౨౫
ఈ ధార్తరాష్ట్రులు ♦ నెల్ల భీష్ముఁడును
ద్రోణుండు నవనీశ్వ♦రుల సమూహంబు
తోనె యీ కర్ణుని♦తోడ, మా వారు
నౌ యోధముఖ్యుల్, భ♦యదమగు నీదు
దంష్ట్రాకరాల వ♦క్త్రముల వేఁ జొచ్చు
వారలు, కొందఱు ♦ పండ్లలోఁ జిక్కి
పొడియైన తలలతోఁ ♦ బొడసూపు వారు. ౨౬, ౨౭
ఏరుల పలు నీరు ♦ లెట్టుల వేగ
సంద్రంబునే చేరఁ ♦ జనియెడు నట్లు
వీరలు నరలోక ♦ వీరులు నీదు
ప్రేఁగు మోములను బ్ర♦వేశించువారు. ౨౮
దీపించు నగ్ని నే ♦ తీరు నాశముకు
మిగుల వేగమె చొచ్చు ♦ మిడుతలు, నట్లె
చేరు లోకంబులు ♦ చెడ నీ ముఖముల
యందును బూర్ణంబు ♦ నైన వేగమున. ౨౯
కన లెడి ముఖములఁ ♦ గలయ భక్షించి
చవి గొనుచున్నావు ♦ సకలలోకములఁ;

దేశంబుల న్నించి ♦ దేవ, నీ కళకు
మించులు జగ మెల్ల ♦ మిక్కిలి క్రాఁచు. ౩౦
ఉగ్రరూపంబున ♦ నుండు నీ వెవఁడొ
నా కాన తీ గదే ♦ నతి యగు నీకు ;
దేవేశ్వరుఁడ, ప్రసా♦దింపు మాద్యుఁడవు
నగు నిన్ను నెఱుఁగఁగా ♦ నాశించు వాఁడ,
నే నీ ప్రవృత్తిని ♦ నెఱుఁగను గాదె. ౩౧

శ్రీభగవంతుఁడు పల్కె.

లోకక్షయముకై పె♦లుచనఁ బెరిగిన
కాలుండ; లోకముల్ ♦ కడప నున్నాఁడ
నిప్పుడు; నీవు లే♦వేనియుఁ గాని
ప్రత్యనీకముల నె♦వ్వార లున్నారొ
యుండఁగాఁ బోవ రా ♦ యోధు లెల్లరును. ౩౨
కావున లె మ్మీవు ♦ కై కొమ్ము యశము,
రిపుల జయించి స♦మృద్ధ రాజ్యమ్ము
నాను, నాచేత ని♦హతులు వీర్ మున్నె,
కారణమాత్రమ్ము ♦ కమ్ము కౌంతేయ. ౩౩
నాచేతఁ బడిన సైం♦ధవు నీవు ద్రోణు
భీష్ముఁ గర్ణుని యోధ♦వీరుల నొరుల
సైతముఁ జక్కాడు, ♦ సమరంబు సల్పు,
ఆజిఁ గెల్తు వరుల ♦ వ్యథఁ జెందవలదు. ౩౪

సంజయుఁడు పల్కె.

విశ్వేశు నీ పల్కు ♦ విని యర్జునుండు
కేల్మోడ్చి వడఁకుచుఁ, ♦ గృష్ణుతో, నెరఁగి

కడుఁగడు బెగడుచు ♦ గద్గదికంబు
ప్రభవింప నమ్రుఁడై, ♦ పలికెను మరల. ౩౫

అర్జునుఁడు పల్కె.

నీ కీర్తనంబునఁ ♦ బ్రియమంది జగము
హర్షించు; రక్కసు ♦ లడరి దిక్కులకు
నుఱుకువా, రెల్ల సి♦ద్ధౌఘంబు నతులు
నొనరించుచుండుఁ, ద♦వును హృషీకేశ. ౩౬
ఆదికర్త వయి బ్రహ్మ♦కు నెక్కుడు నగు
నీకు దేవేశ, దే♦నికయి యెఱఁగరు,
ఓ యనంత, మహాత్మ, ♦ యో సురేశ, యెది,
సదసత్పర మల యక్ష♦ర మవు దీవు. ౩౭
ప్రథమదేవుఁడవు, పు♦రాణపురుషుఁడ,
వీ వనంతాకార ♦ యీ విశ్వమునకుఁ
బరమనిధానంబు, ♦ పరమధామంబు
వేద్యుండవు మఱియు ♦ వేత్త వవుదువు,
నీచేత విశ్వంబు ♦ నిండఁగాఁ బడియె. ౩౮
వాయువు నగ్నియు ♦ వరుణుండు యముఁడు
ప్రపితామహుఁడు ప్రజా♦పతియుఁ జంద్రుండు
నీవు దండం బగు ♦ నీకును వేయి
మాఱులు దండంబు ♦ మరలను గూడ
దండంబు మగుడను ♦ దండంబు నీకు. ౩౯
దండంబు మునుపును ♦ దండంబు వెనుక,
అఖిలుండ, వతి నీకు ♦ నంతటఁ గూడ

అమిత విక్రముఁడ వ♦నంత వీర్యుఁడవు,
వ్యాపించి యున్నాఁడ ♦ వంతయుఁ జక్క,
నవ్వుటచే సర్వుండ ♦ వైనావు నీవు ౪౦
ఈ నీదు మహిమంబు ♦ నెఱుఁగమి కతన
మచ్చికచేతనే ♦ మఱి ప్రమాదమున
నేఁ సఖుఁడని యెంచి ♦ యేఁ బ్రసభమున
యాదవ, కృష్ణ, స♦ఖా, యన్నదాని
శయ్యాసనముల భో♦జనవిహారముల
యందొంటి పాటనే ♦ నందఱిలోన
నేని గేలికి నస♦త్కృతి సల్పినట్టి
దానిని నే వేఁడె♦దను క్షమియింప,
నప్రమేయుఁడ వగు ♦ నచ్యుత నిన్ను ౪౧, ౪౨
ఈ చరాచరము న♦యిన లోకమునకు
నీ, వయ్య పూజ్యుండవు ♦ నెక్కుడౌ గురువు,
సాటివార్ నీకు ము♦జ్జగములయందు
గూడను లే రధి♦కు లయిన లాఁతి
వార లే రుందు ర♦ప్రతిమప్రభావ. ౪౩
ఏఁ, గాన, నీశుండు ♦ నీడ్యుఁ డౌ నిన్ను,
నొడలు వంచి ప్రణామ ♦ మొనరించి నేను
స్వామి, వేఁడెద నన్ బ్ర♦సాదింపఁగాను,
బ్రియను బ్రియుఁడు వోలెఁ ♦ బిత సుతుఁ బోలె
సఖుని సఖుఁడు వోలె ♦ సైఁపనౌ నీకు. ౪౪
కన నట్టియది మునుఁ, ♦ గని సంతసింతు,
భయమునన్ నా మది ♦ వ్యథితమయ్యెఁ గడు,

నా కల్ల రూపంబె ♦ నాథుఁడ, చూపు,
దయసల్పు దేవనా♦థ, జగన్నివాస. ౪౫

గదిని గిరీటిఁ జ♦క్రకరుని గాను
ని న్నట్లె చూడఁగా ♦ నేఁ గోరు దగుమ
యల చతుర్భుజముల ♦ యాకృతితోనె,
యోయి సహస్రబా♦హుఁడ, విశ్వమూర్తి. ౪౬

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఆద్యంబు, తేజోమ♦యం, బనంతంబు,
విశ్వంబు, నీకన్నఁ ♦ బెరవారి చేతఁ
బొడగాంచఁ బడనిది ♦ మును, బరమంబు
నైన యీ రూపంబు ♦ నర్జునా నీకు,
ననుకంప కతమున, ♦ నాత్మయోగంబు
వలనఁ గాన్పింపఁగాఁ ♦ బడియె నాచేత. ౪౭

యజ్ఞ వేదక్రియాధ్య♦యన దానములఁ
దీవ్రతపమ్ముల ♦ దేనిచేఁ గాని,
నీకన్న నొరులకు ♦ నృజగమున నర,
ఈరూపమునఁ గాంచ ♦ నే నసాధ్యుండ. ౪౮

ఇట్టి నాఘోర మ♦యిన రూపము గని
వలదు విమూఢభా♦వము వ్యథ వలదు,
భయ మేది ప్రియమెదం ♦ బడసి మగుడను
నీక్షింపు మల్లదే ♦ యీ నాదు రూపు. ౪౯

సంజయుఁడు పల్కె.

అంత నిట్లని కృష్ణుఁ ♦ డర్జునునకును
గ్రమ్మఱఁ దనరూపుఁ ♦ గాన్పించె, మరలఁ

బూని సౌమ్యంపు వ♦పువు మహాత్ముండు
నూరడించె భయం ♦ బొందిన వీని. ౫౦

అర్జునుండు పల్కె.

సౌమ్య మౌ నీ మాను♦షం బైన రూపు
నిది గని యెప్పట ♦ ట్లివు డైతిఁ గృష్ణ,
స్వస్థ చిత్తము గల ♦ వాఁడను నైతి. ౫౧

శ్రీభగవంతుఁడు పల్కె.

ఈవు కాంచిన యట్టి ♦ యీ నాదురూపు
కడుఁ గనరానిది, ♦ కాంచ నీరూపుఁ
గోరుచుందురు సురల్ ♦ గూడ నెల్లపుడు. ౫౨
ఈవు నన్ గనినట్టి ♦ యీరీతి నన్నుఁ
గనరాదు వేదయ♦జ్ఞంబుల గాని ౫౩
దానంబులనుగాని ♦ తపముచేఁ గాని
అర్జున నన్ని ట్ల♦నన్యమౌ భక్తి
వలనను నిజముగా ♦ వాటమౌఁ దెలియఁ
గనుఁగొనంగను బొందఁ♦గా బరంతపుఁడు. ౫౪
కర్మంబులను నాకుఁ♦గాఁ జల్పువాఁడు,
నను బరమంబుగ ♦ నెంచువాడు,
సంగ మేదిన వాడు, ♦ సర్వభూతముల
వైర మొందనివాఁడు, ♦ భక్తుండు నాకుఁ,
బాండవ యెవ్వండు ♦ వాఁడు నన్పొందు, ౫౫

# పండ్రెండవ అధ్యాయము

## భక్తి యోగము



అర్జునుఁడు పల్కె

ఎపు డిట్లు యుక్తులై ♦ యెవ్వారు నిన్ను
భక్తులు లెస్స యు♦పాసింత్రు; మఱియు
నవ్యక్త మగునట్టి ♦ యక్షరం బెవరు ?
ఎవ రందు యోగ మె ♦ చ్చైఱిఁగనవారు ? ౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

నాపై మనమిడి సం♦తతయుక్తు లగుచు
శ్రేష్ఠ మౌ శ్రద్ధ నర్ ♦ సేవింతు రెవరు,
వార్ యుక్తతము లని ♦ భావింతు నేను ౨
ఇంద్రియగ్రామంబు ♦ నెక్కుడు నిల్పి
యఖిలభూతహితంబు ♦ నందు సక్తులయి
యన్నింట సమబుద్ధి ♦ నందిన వాఁడు
నిత్యం బచింత్యం బ♦నిర్దేశ్యము మఱి
యక్షరం బవ్యక్త ♦ మచల మున్న యది
యంతటఁ గూటస్థ ♦ మవుదానిఁ గొల్చి
పొరినేరు, వార్ నన్నె ♦ పొందఁగాఁ గలరు ౩, ౪
అవ్యక్తమున మది ♦ యానువారి కగు
నధికతరక్లేశ, ♦ మవ్యక్తము దగు
తె న్నొందఁ జిక్కుఁగ ♦ దేహవంతులకు ౫

అఖిలకర్మముల నా♦యందు నర్పించి
మత్పరు లై యొండు ♦ మానె న న్నంటి
నన్నుఁ దలంచుచు ♦ నన్నుఁ గొలుచుచును
నాపై నిలిపిన మ♦నసుఁ గలవారి,
మృత్యుసంసార వా♦రిధిని వేగంబు
దాఁటించువాఁడఁ బా♦ర్థ, యవుదు నేను. ౬, ౭
నాయందె మనమును ♦ నాటుము, బుద్ధి
నాయందె నిలుపుము, ♦ నాయంద యవల
నివసింపఁగలవు సం♦దేహంబు లేదు. ౮
స్థిరముగా నాపైనఁ ♦ జిత్తంబు నిఁకను
నాటలేవే నంత, ♦ నన్ గోరు పార్థ,
యొందఁగా నభ్యాస ♦ యోగంబువలన. ౯
అసమర్థుఁడ వవుదే ♦ నభ్యాసమునను,
నా కారియంబులన్ ♦ బరమంబుగ గొను.
కర్మముల్ నాకయి ♦ కావించుచున్న
వాఁడవై యును సిద్ధిఁ ♦ బడయఁగాఁ గలవు. ౧౦
ఓపవే నిఁక నది♦యుం జలుపంగ,
నాని నా [1]కలువ య♦తాత్ముఁడ వగుచు
నఖిలఫలత్యాగ ♦ మంత నొనర్పు. ౧౧
జ్ఞాన మభ్యాసంబు♦కన్న మేల్ గాదె;
జ్ఞానంబుకన్న ధ్యా♦నంబు గొప్ప యగు,
ఘనము ధ్యానము♦కన్నఁ గర్మఫలంబు

1. కలువ = కలయిక.

నుడుగుట, యుడుగుట ♦ నొదవు శాంతి యట. ౧౨

నిఖిలభూతంబుల ♦ న్నిర్వైరుఁడు మఱి
కరుణయు మైత్రియుఁ ♦ గలిగిన వాఁడు
సమ దుఃఖసుఖుఁడును ♦ క్షమి యతాత్ముండు
నిరతసంతుష్టుండు ♦ నిరహంకృతుండు
నిర్మముండును దృఢ ♦ నిశ్చయుండు మఱి
నాదు భక్తుఁడు యోగి ♦ నాపై నిలిపిన
[1]కఱదయు నెడదయుఁ ♦ గలిగిన యట్టి
వాఁ డెవ్వాఁ డయ్యెడు ♦ వాఁడు మత్ప్రియుఁడు. ౧౩, ౧౪

వ్యథఁ జెంద దెవ్వాని ♦ వలన లోకంబు
వ్యథ యేఁడులోకంబు ♦ వలనఁ జెందండో
భయము నుద్వేగకో♦పములు హర్షంబు
విడిచినాఁ డెవ్వాఁడు ♦ ప్రియుఁడు నా కతఁడు ౧౫

అనపేక్షుఁడును గత♦వ్యథుఁడు దక్షుండు
అన్ని యారంభంబు ♦ లాగిన యట్టి
వాఁ డుదాసీనుఁ డౌ ♦ వాఁడును శుచియు
భక్తుఁ డెవ్వాఁడు నాకు ♦ వాఁడు మత్ప్రియుఁడు. ౧౬

పొంగఁడు కోరఁడు ♦ పొగలఁడు కినుక
నొందఁడు మేల్ కీడు ♦ లూడినవాఁడు
భక్తిమంతుఁ డెవఁడో ♦ వాఁడు మత్ప్రియుఁడు ౧౭

శత్రు మిత్రులయందు ♦ సముఁడును, నట్లె
యవమానమానంబు ♦ లందును, సముఁడు
దుఃఖసుఖంబులఁ, ♦ దుల్యుఁడౌ వాఁడు

---

1 కఱవ = బుద్ధి.

శైత్యోష్ణములయందు, ♦ సంగవర్జితుఁడు,
స్తుతినిందలందును ♦ దుల్యుండు, మౌని,
స్థిరమతి, తృప్తుండు ♦ దేనిచే నైన,
నని కేతుఁడును, వగు ♦ నట్టి నరుండు
భక్తిమంతుం డైన ♦ వాఁడు మత్ప్రియుఁడు ౧౮,౧౯
ఇద్దె ధర్మ్యామృతం ♦ బెట్లు చెప్పఁబడె
నట్లు శ్రద్ధ గలిగి ♦ నట్టి వారలయి
మత్పరము లగుచుం ♦ భజియింతు రెవరొ
భక్తులు కడుఁ బ్రియుల్ ♦ వారును నాకు. ౨౦

---

# పదుమూఁడవ అధ్యాయము

## క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

---

అర్జునుఁడు పల్కె.

జ్ఞేయంబు జ్ఞానంబు ♦ క్షేత్రంబు మఱియు
క్షేత్రజ్ఞుఁ బురుషుఁ బ్ర♦కృతిఁ గూడ నిద్ది
యెఱుఁగఁగాఁ గోరెద ♦ నేను శ్రీకృష్ణ. ౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఈ యొడల్ క్షేత్ర మం♦డ్రిది యెవ్వఁ డెఱుఁగుఁ
దద్విదుల్ వాని క్షే♦త్రజ్ఞుఁ డండ్రు నర. ౨
క్షేత్రంబులం దెల్ల ♦ క్షేత్రజ్ఞుఁ గాను
గూడ న న్నెఱుఁగుము ♦ కుంతీజ, యేది
క్షేత్రజ్ఞుని మఱియు ♦ క్షేత్ర మెఱుఁగుట

యగు నది జ్ఞానం బ ♦ టంచు నా మతము ౩
ఎద్ది యాక్షేత్రంబు ♦ నేలాటి యద్ది
యే వికారములది ♦ యేమి పొందలిది,
యెవ్వండు వాఁడును ♦ నే ప్రభావమును
గలవాఁ డది విను సం♦గ్రహముగ నన్ను. ౪

ఋషులచేతను బహు ♦ రీతుల మఱియు
నానావిధముల ఛ ♦ న్దంబులచేత,
హేతుమంతంబుల ♦ యివి నిశ్చితములు
నగు బ్రహ్మసూత్ర వా♦క్యంబులచేతఁ
గూడ వేర్వేఱ వా ♦ క్రువ్వఁగాఁ బడియె ౫

అవ్యక్తము, మఱి మ♦హా భూతములును,
బుద్ధి, యహంకార♦ముఁ, ద్వేష, మిచ్ఛ,
ధృతియుఁ, జేతనయు, నిం♦ద్రియగోచరములు
నేను, బదియు నొక్క ♦ టింద్రియములును,
దుఃఖంబు, సుఖమును, ♦ [1]దొట్టువ యిద్దె
క్షేత్రమానదియు సం♦క్షేపంబు గాను
సవికారముగను బ్ర♦చారింపఁ బడియె. ౬, ౭

మాన దంభంబుల ♦ మాను, టార్జవము,
నాచార్యుఁ గొలుచుట, ♦ యాత్మనిగ్రహము,
శౌచంబు, స్థైర్యంబు, ♦ క్షాంతి, యహింస,
ఇంద్రియార్థంబుల ♦ యెడ నిరాశయును.
నసహంకృతి, జరామ♦యములు దుఃఖంబు

---

1 తొట్టువ = వర్గము, సమూహము.

జన్మమృత్యుజ్వరల దో♦షము దెలియుటయు,
గృహసుతదారాదు ♦ లెడ ననక్తియును,
వెను గూర్మిలేమి, యే♦వేళ నిష్టంబు
గాని యనిష్టంబు ♦ గాని కలిగిన
తరుణమున సమచి♦త్తతయు, నాపైనఁ
జెదరని మొనలను ♦ జేరని భక్తి,
జనసంఘమందు న♦సక్తి, విడియగు
నెడనుంట, యధ్యాత్మ ♦ మెఱుఁగట స్థిరత,
తత్త్వంపు జ్ఞానార్థ ♦ దర్శనంబు, నిది
జ్ఞానంబు దీనిక♦న్నను వేఱగునది
యజ్ఞాన మనునది♦యని పల్కఁబడియె. ౮,౯,౧౦.౧౧,౧౨
ఎయ్యది తెలియనౌ ♦ నెయ్యదెఱుంగ
నమృతంబు వడయనౌ ♦ నది యనాదియును
మత్పరంబు నగు బ్ర♦హ్మ మది వచింతు
సత్తని దాని న♦సత్తని యనరు. ౧౩
అంతట గాల్ కేలు ♦ నంతట మోము
తలకనుల్ వీనులం♦తటఁ గల్గి జగము
నందంతయును నిండి ♦ యయ్యు దున్న యది. ౧౪
అదివెల్గు నఖిలేం♦ద్రియగుణంబు లంటి
ఇంద్రియంబులలోన ♦ నెవ్వి లేనియది,
అయ్యు ననక్తంబు ♦ నన్ని భరించు,
గుణములు లేదయ్యు ♦ గుణములం గొనును,
బైట, భూతముల లో♦పల, నున్న యద్ది,
చరమును, నచరంబు ♦ సౌక్ష్మ్యంబు కతన

నెఱుఁగరానిది, యది ♦ యెడ నున్నదియును
గడ నున్నది, యవిభ♦క్తంబయ్యు నద్ది
భూతముల విభక్త♦మువలె నున్నదియు,
భూతంబులను బ్రోచుఁ ♦ బొడమించు మ్రింగు
నదియుఁగా నెఱుఁగంగ ♦ నౌ నది, వెలుఁగు
గలవాని వెలుఁ గంద్రు, ♦ కానిది తమము,
జ్ఞానంబు జ్ఞేయంబు ♦ జ్ఞానగమ్యంబు, [౧౮
నన్నింటి హృదయంబు ♦ లందుండునదియు. ౧౫,౧౬,౧౭,
క్షేత్రంబు జ్ఞానంబు ♦ జ్ఞేయంబు నిట్లు
కథితంబు లయ్యె సం♦గ్రహముగ, నాదు
భక్తుం డి దెఱిఁగి మ♦ద్భావంబున కగు. ౧౯
ప్రకృతిపురుషుల ను♦భయులను గూడ
నెఱుఁగు మనాదులె, ♦ యెఱుఁగు గుణములు
మఱి వికారంబులుం ♦ బ్రకృతిఁ గల్గునని. ౨౦
కార్యకారణములఁ ♦ గలిగించు టందుఁ
బ్రకృతి హేతు వగు నా ♦ వచియింపఁ బడును,
బురుషుండు సుఖదుఃఖ♦ములను గుడుచుట
యందు హేతువగు నా ♦ ననఁగను బడును. ౨౧
ప్రకృతి స్థితుండయి ♦ ప్రకృతిజంబులగు
గుణములం బురుషుండు ♦ గుడుచును గాదె
వాని మేల్ కీ [1]డిక్కు♦వలఁ బుట్టుటకును
గారణంబు గుణసం♦గంబు నయ్యెడును ౨౨

1. ఇక్కువ = స్థానము.

ఈ మేనను బడుండ♦యైన పురుషుండు
భర్త భోక్తయు మహే♦శ్వరుఁ డనుమోది
పరమాత్మ యనియు ను♦పద్రష్ట యంద్రు ౨౩
పురుషుని మఱిగుణం♦బులతోడఁ బ్రకృతి
నెవ్వాఁ డెఱుంగునో ♦ యి ట్లతఁ డన్ని
తెఱఁగుల నున్నను ♦ దిరిగి పుట్టండు ౨౪
ఆత్మఁ గాంచెద రాత్మ♦యం దాత్మచేత
ధ్యానానఁ గొందఱి♦తరులు సాంఖ్య మగు
యోగంబునను, గర్మ♦యోగాన నొరులు. ౨౫
ఇట్లెఱుంగని యొరు ♦ లితరుల వలన
విని యుపాసింతురు, ♦ వినుటయం దాస్థ
యమరిన వారలు ♦ నవు వారు గూడఁ
దప్పక మృత్యువుఁ ♦ దాఁటంగఁ గలరు ౨౬
సత్త్వ మేదేఁ గల్గు ♦ జంగమం బేని
స్థావరం బేని బార్థ ♦ దాని నెఱుంగు
క్షేత్రంబు క్షేత్రజ్ఞ ♦ చేరికఁ నాఁగ. ౨౭
సర్వభూతంబుల ♦ సమముగా నుండు
పరమేశ్వరుఁ గను న♦శ్వరములలోన
[1]నీల్గని వానిని ♦ నెవఁడు వాఁడు కను. ౨౮
సర్వత్ర సమముగ ♦ సమవస్థితునిగ
నీశ్వరుఁ గనుచుఁ దా ♦ హింసించుకొనఁడు
తన, నంతఁ బరమప♦దం బొందుఁ గాదె. ౨౯
ఎల్లకర్మములు ప్ర♦కృతిచేన జరగు,

1 ఈల్గు = చచ్చు.

కావించు నది కాదు ♦ కావున నాత్మ,
యని కాంచు నెవ్వండు ♦ కనువాఁడు వాఁడు. ౩౦
భూతముల విభేద♦ము నొకట నుంట
యెఱుఁగుఁ యందుండి♦యే యాట నెపుడు
కనుగొను నప్పుడు ♦ కలియు బ్రహ్మంబు. ౩౧
గుణరహితత్వ మనాద♦గుట నవ్యయుండు
నగునట్టి యీ పర♦మాత్ముఁడొడలున
నుండియు నర, సల్ప ♦ దొందదు సోఁకు. ౩౨
సర్వగతుండయ్యు, ♦ సౌక్ష్మ్యంబు కతన
నాకాశ మెట్టుల ♦ నంటఁగా రాదో,
యట్లె దేహంబు నం♦దంతట నుండు
నటులె నాత్మయుతుఁడు ♦ నంటఁగా రాఁడు. ౩౩
ఈ సర్వలోకంబు ♦ నినుఁ డొక్కరుండు
వెల్గించు నెట్టుల ♦ విజయ యట్టులను
క్షేత్రంబు నంతయు ♦ క్షేత్రి వెల్గించు. ౩౪
భూతప్రకృతి మోక్ష♦మును మఱి యెవరు
క్షేత్రంబునకు మఱి ♦ క్షేత్రజ్ఞునకును
గలుగు నీ భేదంబు ♦ జ్ఞాన చక్షువుల
గాంతురు వారలు ♦ కాంతురు పరము. ౩౫

# పదునాల్గవ అధ్యాయము

## గుణత్రయవిభాగయోగము

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఇందుండి మునులెల్ల ♦ నెయ్యది యెఱింగి
పరమసిద్ధి గనిరి ♦ పరమ మా యట్టి
యెఱుకలలో నెల్ల ♦ నెక్కుడౌ నెఱుక
మగుడనుఁ జక్కఁగా ♦ వచియించెదను. ౧
ఈజ్ఞానము నుపాశ్ర♦యించు వారలయి
నాదు సాధర్మ్యము ♦ గన్నట్టి వారు
సృష్టికాలంబునఁ ♦ జెందరు[1] బాము
ప్రళయకాలంబునన్ ♦ వ్యథయును గనరు. ౨
అగును నా యోని మ♦హద్బ్రహ్మ, యందు
గర్భంబు నిలుపుదుఁ ♦ గౌంతేయ నేను,
సర్వభూతంబులు ♦ జన్మించు నంత. ౩
సర్వయోనుల యందు ♦ జన్మించు నెవ్వి
యామూర్తులకును మ♦హద్యోని బ్రహ్మ,
బీజప్రదుఁడ నీవు ♦ పిత నేను బార్థ. ౪
తమము రజంబు స♦త్త్వమను గుణములు
ప్రకృతిసంభవములు, ♦ బంధించు నొడలు
నందుఁ గౌంతేయ యవ్యయుఁ డగు దేహి. ౫
అందు సత్త్వము శుద్ధ ♦ మౌట వలనను
నగుఁ బ్రకాశకము న♦నామయ మనఘ

1. బాము = జన్మము.

జ్ఞానసుఖంబులఁ ♦ గలసి బంధించు.
రాగాత్మకంబని ♦ రజము నెఱుంగు
సంగంబుఁ దృష్ణ వి♦జయ, కలిగించు
కర్మసంగంబుచేఁ ♦ గట్టు దేహి నది.
అజ్ఞానజము తమ ♦ మని పార్థ యెఱుఁగు
మఖిలదేహులను మో♦హము గొల్పుఁ గట్టు
నద్ది ప్రమాద ని♦ద్రాలస్యములను.
కౌంతేయ, సుఖమునఁ ♦ గలుపు సత్త్వంబు,
కర్మముల రజస్సు, ♦ జ్ఞానంబు నలమి
తమము ప్రమాదంబుఁ ♦ దవిలించుఁ గాదె.
సత్త్వంబు నగు రజ♦స్తమముల నడఁచి
సత్త్వతమముల ర♦జంబును, దమము
సత్త్వరజముల వి♦జయ, యదే రీతి. ౧౦
ఈ దేహ మందలి ♦ యెల్ల త్రోవలను
జ్ఞాన ప్రకాశము ♦ గలిగెడు నెపుడు
నపు డెచ్చినది సత్త్వ ♦ మని యెఱుంగునది. ౧౧
రజ మెచ్చి యుండఁ గ♦ర్మముల మొనయుట
స్పృహయు లోభంబు ప్ర♦వృత్తి యశమము
పాండవ, యియ్యవి ప్ర♦భవంబు నొందు. ౧౨
తమము పాండవ, వివృ♦ద్ధం బయి యుండ
నప్రవృత్తియును మో♦హము ప్రమాదంబు
నప్రకాశము నివ్వి ♦ యందు సంభవము. ౧౩
సత్త్వం బడరియుండఁ ♦ జనునేని దేహి
యపు డుత్తమవిదుల ♦ యవికైన యట్టి

యమలలోకంబుల ♦ నందఁ గలండు. ౧౪

రజమునఁ జని కర్మ♦రతులందుఁ బుట్టు,
తమమునఁ జనిన యా♦తండును సల్లె
మూఢయోనుల యందుఁ ♦ బొందు జన్మంబు. ౧౫

సాత్త్వికం బచ్ఛంబు ♦ సత్కర్మములకు
ఫలము, రజమునకు ♦ ఫలము దుఃఖంబు,
నంద్రు తమము ఫల ♦ మజ్ఞానము నని. ౧౬

సత్త్వంబు వలనను ♦ జ్ఞానంబు, రజము
వలనను నగును లో♦భమె, తమమునను
గలుగుఁ బ్రమాద మ♦జ్ఞాన మోహ ములె. ౧౭

సాత్త్వికుల్ మీఁదకుఁ ♦ జనుదురు, నడుమ
నిల్తురు రాజసుల్, ♦ నీచగుణముల
వృత్తుల తామసుల్ ♦ క్రింది కేగెదరు. ౧౮

కర్త గుణంబుల♦కంటె నింకొకఁడు
కాఁడని యెప్పుడు ♦ కాంచు వివేకి
పొడగాంచెడిని గుణం♦బులకంటెఁ బరుని
నపుడు మద్భావంబు ♦ నందెడు వాఁడు. ౧౯

దేహజంబు లగునీ ♦ త్రిగుణముల్ దాఁటి
పుట్టువు ముదిమి చావు ♦ వెతలవలన
విడువంగఁ బడి దేహి ♦ బెరయు నమృతము. ౨౦

అర్జునుఁడు పల్కె.

ఈ మూఁడు గుణముల ♦ నీఁదిన వాని
యానవా లేమార్య, ♦ యాచార మేమి?
ఈమూఁడు గుణముల ♦ నెట్టులఁ గడచు? ౨౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

సాత్త్వికం బేని రాజసమేని కాని
తామసం బేఁ గాని దాపురం బైన
వానిని గూరిచి వైరంబు గొనఁడు
కాంక్ష సేయఁడు పార్థ, కలుగనివాని. ౨౨
ఊరక చూచుచు నున్నవాని గతి
నిలుచును, నెవ్వానిని గదల్ప లేవు
గుణములు, వర్తించు గుణములే యంచు
నెవఁ డుండు, చలియింపఁ, డింపునొగుల్ల
నొక్కటి గానుండు, నుండు స్వస్థుఁ డయి,
పొన్ను ఱాల్ మన్నొక్క పోలికఁ గాంచు,
నగు సముఁడు ప్రియాప్రియముల, ధీరుండు,
సముఁడును నిందాత్మ సంస్తుతు లందు,
నవమాన మానంబులందుఁ దుల్యుండు,
సముఁడు మిత్రారి పక్షంబులయందు,
ప్రారంభముల నెల్ల వదలినవాఁడు,
నతఁడు గుణాతీతుఁ డనిపల్కఁ బడెడు, ౨౩,౨౪,౨౫
కదులని భక్తియోగంబుచే నన్ను
గొలుచువాఁ డీఁది యీ గుణముల లెస్స
బ్రహ్మభావంబును బడయఁగాఁ గలఁడు. ౨౬
ఆశ్రయం బౌదుఁగా యమృత మవ్యయము
నైన బ్రహ్మమునకు నైకాంతిక మగు
సౌఖ్యమునకును శాశ్వత ధర్మమునకు. ౨౭

# పదునైదవ అధ్యాయము

## పురుషోత్తమప్రాప్తియోగము.

శ్రీ భగవంతుఁడు పల్కె.

పైన వేరులు క్రింది ♦ వైపునఁ గొమ్మలు
నాకులు ఛందంబు ♦ లగు నవ్యయంబు
నైన యశ్వత్థంబు ♦ నని వచియింత్రు,
దాని నేఁ డెఱుఁగు వే ♦ దజ్ఞుండు వాఁడు ౧
ననలు విషయముల్, గు ♦ ణ ప్రవృద్ధములు
దానివి కొమ్మలు క్రిం ♦ దను పైఁ జెరిగిన
యవిగ నుండును, మను ♦ ష్య జగతియందుఁ
గర్మాను బంధముల్ ♦ గానుండు దాని
మూలముల్ క్రిందివై ♦ పునఁ బర్వియుండు. ౨
దాని రూపంబు మొ ♦ దలు మన్కియుఁ దుద
గానియు నిక్కడఁ ♦ గనఁగొనరాదు.
ప్రబల మూలమగు నీ ♦ రావి వృక్ష మగు
సంగరాహిత్యమను ♦ శస్త్రాన నఱికి
యెటఁ జేరఁగా లేదొ ♦ యింక వచ్చుటట్టి
స్థానంబుఁ దగునంతఁ ♦ దడవికొనంగ
మొదలునాఁటి ప్రవృత్తి ♦ పొరలె నెందుండి
యా యాదిపురుషునే ♦ *యాశ్రయింపఁదగు, ౩, ౪
మోహం బహంకార ♦ మును లేనివారు

* ప్రపద్యేత్. పా. ప్రపద్యే.

సంగదోషంబును ♦ జంపినవారు
నధ్యాత్మనిత్యులు ♦ హతకాములు మఱి
సుఖదుఃఖములనెడి ♦ జోడులు విడిన
యట్టి ప్రాజ్ఞులు కందు ♦ రా స్థిరపదము. ౫
దేనిని బొందిన ♦ దిరిగి రాఁ బోరు
దాని బావక చంద్ర♦తపనులు వెలుఁగఁ
జేయ రయ్యది నాదు ♦ శ్రేష్ఠధామంబు ౬
జీవలోకంబున ♦ జీవుఁ డౌ నట్టి
యాది లేకున్న నా ♦ యంశంబె ప్రకృతి
యందుండు మనముతో ♦ నాఱైన యట్టి
యింద్రియంబుల నొన♦రించు కర్షణము. ౭
ఆశయం బందుండి ♦ యనిలంబు వలపుఁ
బోలెను నీశుండు ♦ బొందెఁ బాయుతఱిఁ
బొందె నొందెడు నప్డు ♦ పోవు వీనిఁ గొని. ౮
రసనంబు శ్రోత్రంబు ♦ ఘ్రాణంబు మనముఁ
జక్షువున్ మఱియు స్ప♦ర్శనమునుం గూడి
భుజియించును విషయం♦బులను నీతండు. ౯
ఉండువానిని జొచ్చు ♦ చుండెడు వాని
నేని కుడుచు వాని ♦ నేఁ గుణాన్వితుని
గామూఢు లగువారు ♦ కనుఁ గొనలేరు,
కనుఁ గొనుదు రెఱుక ♦ కన్నులవారు. ౧౦
కాంతురు తమయందుఁ ♦ గలయట్టి వీని
యత్నించు యోగులు, ♦ నజ్ఞులు వీని

నకృతాత్ములు కనరు ♦ యత్న ముండియును. ౧౧
ఆదిత్యునందుండి ♦ యఖిలలోక మెది
వెలిఁగించు, నగ్నిని, ♦ విధునందు, నేది
గలదా వెలుఁగు నాది♦గా నెఱుంగునది. ౧౨
భూమి నావేశించి ♦ భూతంబు లేను
దాల్తు నోజస్సుచే♦త రసాత్మకుఁడగు
చంద్రుడనై ప్రోతు నో♦షధుల నన్నింటి. ౧౩
వైశ్వానరుండనై ♦ ప్రాణుల మొడలఁ
బొదివి ప్రాణాపాన♦ములఁ గూడి నాల్గు
[1]నంగుల యన్నంబు ♦ నఱిగింతు నేను. ౧౪
అన్నింటి హృదయంబు ♦ లందుండు నిలిచి,
నన్నుండె స్మృతియు జ్ఞా♦న మపోహనమును.
వేదంబు లన్నింట ♦ వేద్యుండ నేనె
వేదాంతకృత్తేనె ♦ వేదవిదుఁడను. ౧౫
ఇర్వురీ పురుషులు ♦ నిల క్షరాక్షరులె
యనఁగ భూతంబులు ♦ నఖిలముల్ క్షరుడు
నందురు కూటస్థుఁ ♦ డక్షరుఁ డనియు. ౧౬
ఉత్తమపురుషుఁ డ♦న్యుం డవ్యయుండు
ముల్లోకముల నిండి ♦ ప్రోచు నెవ్వాండు
నా యీశుఁ 'బరమాత్ము'ఁ ♦ డనుచుఁ బల్కెదరు. ౧౭
క్షరమును దేన నేఁ ♦ గడతు నక్షరము
కన్నను నధికుండ ♦ నౌదును దానఁ

---

1. అంగు = అంగము, విధము.

పురుషోత్తముఁ డనంగఁ ♦ బొలుతు లోకంబు ౧౮
నందును వేదంబు ♦ లందును గూడ.
ఎవఁ డసమ్మూఢుఁ డై ♦ యెఱుఁగును నన్ను
పురుషోత్తముఁ డని నృ♦పుఁడ సర్వవిదుఁడు
వాఁడు గొల్చును సర్వ♦భావమ్మున నను. ౧౯
ఇటు గుహ్యతమ మైన ♦ యీశాస్త్ర మనఘ,
కఱపితి, నిది యెఱుం♦గఁ గృతకృత్యుండు
బుద్ధిమంతుండు న♦వుదు పృథాతనయ. ౨౦



# పదునాఱవ అధ్యాయము.

## దైవాసురసంపద్విభాగయోగము.



శ్రీభగవంతుఁడు పల్కె.

ఆర్జవం, బభయంబు, ♦ యజ్ఞంబు, తపము,
సత్త్వ సంశుద్ధియు, ♦ స్వాధ్యాయము, క్షమ,
తేజంబు, శౌచంబు, ♦ ధృతి, భూతములను
దయ, యలోలుప్త్వంబు, ♦ దానంబు, దమము,
ననతిమానిత్వంబు, ♦ నద్రోహము, మఱి
సత్యం, బహింసయు, ♦ శాంతియు, మఱియు,
జ్ఞానయోగవ్యవ♦స్థ, యపైశునంబు,
త్యాగంబు, హ్రీయు, మా♦ర్దవ, మచపలత,
యక్రోధమును దైవి ♦ యైన సంపదను
దగఁ బుట్టువాని కో♦దవుఁ బాండవేయ. ౧, ౨, 3

దంభంబు క్రోధంబు, ♦ దర్పముఁ బార్ష్య,
యజ్ఞానము, పరుష ♦ తాభిమానములె
యాసురీ సంపద ♦ కైనవాని కగుఁ ౪
విడుదలకొఱకు దై ♦ వీసంపద యగుఁ
గట్ట నాసురియు, దుః ♦ ఖంబు వలవదు,
పార్థ దైవి యగు సం ♦ పదకుఁ గల్గితివి. ౫
ఈ లోకమున భూత ♦ సృష్టులు రెండు
నాసురంబును దైవి ♦ యనియు మాత్రంబె
విరివిగాఁ దైవంబు ♦ వివరింపఁ బడియె,
విను మాసురంబును ♦ విజయ నావలన. ౬
ఎఱుఁగర్ ప్రవృత్తి ♦ నివృత్తు లాసురులు
నగు జనుల్ వారల ♦ యందు శౌచంబు
సత్యంబు గాని యా ♦ చారమేఁ లేదు. ౭
అప్రతిష్ఠం బస ♦ త్యం బనీశ్వరము,
కామంబు హేతువు ♦ గాఁగ నొండొంటఁ
గలిగిన యట్టిది ♦ గాక వే ఱేమి
కలదు జగమని వ ♦ క్కాణింత్రు వారు ౮
క్రూరకర్ములును ద ♦ క్కువ బుద్ధివారు
నాని యీ మతము న ♦ ష్టాత్ము లహితులు
జన్మించెదరు జగ ♦ క్షయమునకు నయి. ౯
కొనలేని కామంబుఁ ♦ గూడి దంభంబు
మానమదంబులం ♦ బ్రబ్బి మోహంబు
వలనను గారాని ♦ పట్టులం బట్టి
వర్తించెద రశుచి ♦ వ్రతు లగువారు. ౧౦

ప్రళయాంత మైన యా♦పరిమేయచింత
నొందిన వారు, కా♦మోపభోగంబు
పరమంబుగాఁ గొను♦వారు, నింతె యని
నచ్చినవారునుం, ♦ గామంబు నాని
క్రోధ, మాస లను నూ♦ర్లోఁగులచేతఁ
గట్టు వడినవారు ♦ కామంబుఁ గుడువ
నాసింతు రర్థచ♦యము లక్రమమున ౧౧, ౧౨
పొందితి నే డిది, ♦ పొందు దీ కోర్కెఁ,
గల దిది నా కింకఁ ♦ గలిగెడు మఱియు
నీ ధనంబును గూడ; ♦ నీ పగతుండు
హతుఁ డయ్యె నాచేత, ♦ నడఁచెదఁ దక్కు-
వారలఁ గూడను; ♦ ప్రభుఁడను నేను,
నేను సిద్ధుండను, ♦ నేభోగి, సుఖిని,
నాఢ్యుండ, బలియుఁడ, ♦ నభిజాతు; నాకు
నీడేఁ డొరుఁడు! వ్రేల్తు, ♦ నిత్తు, మోదింతు;
నిట్టు లజ్ఞాన మో♦హితులు పెక్కులగు
చిత్త విభ్రాంతులఁ ♦ జెందిన వారు
మోహ జాలంబుచేఁ ♦ బూరిఁ జుట్టఁగఁబడి,
కామభోగంబులం♦గడుఁ దగులుకొని
యశుచియగు నరక♦మందుఁ బడెదరు. ౧౩,౧౪,౧౫,౧౬
స్తబ్ధు లౌ వా రాత్మ ♦ సంభావితులును
ధన మానమదములం ♦ దవిలిన వారు
విధి పూర్వకము గాక ♦ పేరున కైన
జన్నముల్ డంబుగాఁ ♦ జలిపెడి వారు. ౧౭

దర్పంబు బలము క్రో♦ధంబు కామమును
హంకారమును లెస్స ♦ యాశ్రయించి తమ
దేహంబులను బర♦దేహంబులందు
నుండు నాపై ద్వేష♦మొందు కూళలను
గ్రూరుల [1]బరుల నె♦క్కుడు నసూయకుల
సతతమూ నీచులఁ ♦ సంసార మునను
నాసురీ యోనుల ♦ యందె త్రోసెదను. ౧౮,౧౯
అసురి యగుయోని ♦ యందున [2]నెనసి
పుట్టుక పుట్టుకఁ ♦ మూఢులు నగుచుఁ
బ్రాపింపకే నన్ను ♦ బాండవేయుండ,
యరుగుదు రింకను ♦ నధమ మౌ గతికి. ౨౦
ఆత్మకు నాశనం♦బైన యట్టి యది
యిది కామమును గ్రోధ ♦ మింకను లోభంబు
నను మూడు తెఱఁగులు ♦ నౌ ద్వార మగును
నరకంబునకుఁ గావు♦న *విడు మి మ్మూఁటి. ౨౧
పార్థ, తమమునకు ♦ ద్వారంబు లైన
యి మ్మూఁటి వలనను ♦ నెడయైన నరుఁడు
నాత్మ శుభంబును ♦ నాచరించెడిని
నంతటఁ బరమంబు ♦ నగు గతిం బొందు. ౨౨
ఎవఁడు శాస్త్రవిధిని ♦నెడఁబాసి యిచ్చ
వచ్చినట్లు చరించు ♦ వాఁడు సుఖంబుఁ
గనఁడు సిద్ధిఁ బరమ♦గతి నేని కాని. ౨౩
కానఁ గార్యంబు న♦కార్యంబు రూఢి

---

1 బరి = శత్రువు. 2 ఎనయు = పొందు. *ఏతత్త్రయంత్యజ.

చెప్పఁ బ్రమాణంబు ♦ శాస్త్రంబు నీకు,
శాస్త్రవిధానంబు ♦ శాసించు దాని
నెఱిఁగి చెప్పఁ దగుదు ♦ విహితఁ గర్మంబు. ౨౪

# పదునేడవ అధ్యాయము

## శ్రద్ధాత్రయవిభాగయోగము.

అర్జునుఁడు పల్కె.

శాస్త్రవిధి విడిచి ♦ శ్రద్ధతోఁ గూడి
జన్నంబు లెవ్వరు ♦ సల్పుదు రవ్వారి
నిష్ఠయు నేని య♦నియెదరు కృష్ణ,
సాత్త్వికమా రాజ♦సంబ తామసమ! ౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

ఒడలు దాలుపులకు ♦ నుండెడు నట్టి
స్వాభావిక మగు నా ♦ శ్రద్ధ ముత్తెఱఁగు,
సాత్త్వికి యనియు రా♦జసి యనియు మఱి
తామసి యనియును ♦ దానిని వినుము. ౨
సత్త్వాను రూప మా ♦ శ్రద్ధ యందఱకుఁ,
గుంతీజ, శ్రద్ధతోఁ ♦ గూడిన యట్టి
యీ పురుషుఁ డెవఁడో ♦ యెట్టిశ్రద్ధ గల
వాఁడో వాఁడును నట్టి ♦ వాఁడె యయ్యెడును. ౩
పొనరింత్రు దేవుల ♦ పూజ సాత్త్వికులు
రాజసులును యక్ష♦రాక్షసుల మఱి

తామస జనులైన ♦ తక్కిన వారు
పూజింత్రు ప్రేతముల్ ♦ భూతగణములు. ౪
తనువున నున్న ధా♦తుగ్రామము మఱి
యంత శ్శరీరస్థుఁ ♦ డౌ నన్నుఁ గూడ
నలుపు వారై యహం♦కారదంభములఁ
గామంబు బలము రా♦గంబులం గూడి
యెవ్వారు జ్ఞానవి♦హీను లా జనులు
భయదంబు మఱి శాస్త్ర♦బాహ్య మౌ తపము
నెరపువా రాసుర ♦ నిశ్చయు లెఱుఁగు. ౫,౬
ఆహారమును గూడ ♦ నందఱకుఁ దిగ
వెరవుల నయ్యెడుఁ ♦ బ్రియము, దానంబు
యజ్ఞంబు జపమును ♦ నట్టిదె యౌను,
విను వాని యియ్యది ♦ భేదంబు నీవు. ౭
ఆరోగ్యమును సత్త్వ ♦ మాయువు బలముఁ
బ్రీతియు సుఖమును ♦ బెంచెడు నవియు,
సాత్త్వికుల కగు, ర♦స్యములు హృద్యములు
స్థిరములున్ స్నిగ్ధ మౌ ♦ తిండ్లు ప్రియములు. ౮
కటువు నామ్లంబు రూ♦క్షము లవణంబు
నత్యుష్ణమును విదా♦హంబు తీక్ష్ణంబు
నామయ దుఃఖ శో♦కానయము లగు
నాహారము లగుఁ బ్రి♦యము రాజసులకు. ౯
ప్రాఁచి ముఱిగినది ♦ రసహీన మైన
యదియు నుచ్ఛిష్టంబు ♦ నపరిశుద్ధంబు
నైనది దుర్గంధ ♦ మైన దెయ్యదియొ

యా తిండి ప్రియ మైన ♦ యది తామసులకు. ౧౦
చెల్లఁగాఁ దగిన దే ♦ జన్నంబు నంచు
మది నిశ్చయంబు న♦మరఁజేసి ఫలము
నాస చేయనియట్టి ♦ యాతండు సల్పు
శాస్త్రదృష్ట మగు య♦జ్ఞంబు సాత్త్వికము. ౧౧
ఫలముఁ గోరియును దం♦భంబు కొఱకు నె
కావించునట్టి య♦జ్ఞంబు రాజసము
నౌ ననియును భార♦తాధిప యెఱుఁగు. ౧౨
శ్రద్ధలేనిది యమం♦త్రకము నన్నంబు
దానంబు లేనిద ♦ దక్షిణ మునుగ
నగు విధిహీనంబు ♦ నైనది యైన
యజ్ఞంబు తామసం ♦ బని పల్కఁబడెడు. ౧౩
దేవతల గురుల ♦ ద్విజులఁ బ్రాజ్ఞులను
గొలుచుటయును హింస ♦ కూర్పకయుంట
శౌచంబు మఱి బ్రహ్మ♦చర్య మార్జవము
దైహికంబగు నట్టి ♦ తపము నాఁ బరగు
ప్రియము హితంబ ను♦ద్వేగకరంబు
సత్యంబు నగు పల్కు ♦ స్వాధ్యాయమెదది
యభ్యసించుటె వాఙ్మ♦యతపంబు నండ్రు. ౧౪
మనసు ప్రసాదముం ♦ భావ సంశుద్ధి
యాత్మనిగ్రహము సౌ♦మ్యతయు మౌన మెది
మానసతపమునాఁ ♦ బల్కుదు రద్ది. ౧౫
యుక్తుల్ ఫలాపేక్ష ♦ యుండని నరులు

శ్రేష్ఠవరా శ్రద్ధమై ♦ చేయు నా మూడు
విధముల తపము సా♦త్త్విక మని యండ్రు. ౧౭
సత్కారమాన పూ♦జనముల కొఱకు
దంభంబునన సల్పు ♦ తపమిటఁ జలము
నధ్రువ మగుదాని ♦ నండ్రు రాజసము. ౧౮
మోటుపట్టునఁ దనఁ ♦ బొగలంగఁ జేయు
నదియు నొరుల చేటు♦కై సల్పున దెది
యల్ల తపంబును ♦ నండ్రు తామసము. ౧౯
ఈయఁ గర్జంబని ♦ యెది యుపకారి
కాని వానికి దేశ♦కాల పాత్రములఁ
గని యీఁ బడును సాత్త్వి♦క మనఁబడు నది. ౨౦
ప్రత్యుపకారంబు ♦[1]వడయఁగా నేని
ఫలము గోరియు నేని ♦ వడతోడ నిచ్చు
దానిని రాజస ♦ దానంబు నండ్రు. ౨౧
తగనట్టి కాలపాత్ర ♦ స్థానములను
సత్కరింపక యవ♦జ్ఞమయి నొసంగు
దాన మెయ్యది దానిఁ ♦ దామసంబండ్రు. ౨౨
‘ఓ’ మ్మని ‘త’ త్తని ♦ యును ‘స’ త్తని యగు
ముత్తెఱంగౌ నామ♦ములు బ్రహ్మమునకు,
దాని వలనను మొ♦దట వేదములును
బ్రాహ్మణుల్ యజ్ఞముల్ ♦ వడిరి నిర్మింప. ౨౩
బ్రహ్మవాదుల శాస్త్ర♦పద్ధతిఁ జరుగు

1. వడ = శ్రమము.

యజ్ఞ దానతపఃక్రి♦యలు, కాన, నెప్పుడు
నడుచు నోంకారము ♦ న్బలికినవి యయి. ౨౪
'త' త్తని యొనరించె♦దరు ముముక్షువులు
ఫలము నాశింపక ♦ పలు తెఱంగులగు
దానక్రియల్ యజ్ఞ♦తపముల క్రియలు. ౨౫
సద్భావమునఁ బార్థ, ♦ సాధుభావమున
నగుఁ బ్రయుక్తంబు 'స' ♦ త్తనునది, యట్లె
'స'చ్ఛబ్ద మంత్రు ప్ర♦శస్తకర్మముల, ౨౬
యజ్ఞదాన తపంబు♦లం దుంట 'సత్తు'
ననఁబడును, దదర్థ ♦ మగు కర్మములును
సైతము 'స' త్తను ♦ సంజ్ఞనే పరగు. ౨౭
అశ్రద్ధతోఁ జల్పు♦నట్టి హోమంబు
దానంబు కర్మముం ♦ దప మెయ్యది యది
పార్థ, 'యస' త్తనఁ ♦ బడియెడు, నట్టి
యది యిక్కడకుఁ గాని ♦ యటకేనిఁ గాదు. ౨౮

# పదునెనిమిదవ అధ్యాయము.

## మోక్షసన్న్యాసయోగము.

అర్జునుఁడు పల్కె.

త్యాగంబుయొక్క స♦న్న్యాసంబుయొక్క
తత్త్వంబు నే విశ♦దంబుగా నెఱుఁగ
వలతు హృషీకేశ, ♦ స్వామి, కేశిఘ్న, ౧

శ్రీ భగవంతుఁడు పల్కె.

కామ్యంబు లగునట్టి ♦ కర్మముల్ విడుట
సన్న్యాస మందురు ♦ జ్ఞానులౌ వారు,
నఖిలకర్మఫలంబు ♦ [1]లఱుట త్యాగంబు
సనియు విచక్షణు ♦ లాడెదు వారు. ౨
కర్మంబు దోషంబు♦గా విడువంగఁ
దగునంద్రు బుధులు కొం♦దఱు, లాఁతివారు
దానముల్ యజ్ఞముల్ ♦ తపములు నైన
కర్మముల్ త్యాజ్యముల్ ♦ గానివి యంద్రు. ౩
ఆ త్యాగమున నిశ్చ♦యంబును వినుము
చెప్పెదే భారత♦శ్రేష్ఠ, త్యాగంబు
పురుషవర, త్రివిధం♦బు లది నాఁ బడెఁగ. ౪
దానంబు యజ్ఞంబు ♦ దప మను [2]కఱత
కార్యంబె యగు, నది ♦ కాదు త్యాజ్యంబు;
దానంబు యజ్ఞంబు ♦ దపమును గూడఁ
బ్రాజ్ఞులౌ వారికిఁ ♦ బావనంబు లగు. ౫
ఫలమును సంగముఁ ♦ బాసి యీ పనులు
సైతము చాలును ♦ జల్ప నాఁ బార్థ
దృఢము నుత్తమము న♦యిన నాదు మతము. ౬
నియతకర్మంబుల ♦ నిలుపుట చనదు,
వానిని మోహంబు ♦ వశమునఁ జేసి
త్యజియించు టందురు ♦ తామసం బనుచు. ౭

1. అఱుట = ఉజ్జనము. 2కఱత = చెద్దు.

ఎవఁడు దుఃఖ మనియె ♦ యేది కర్మంబు
నొడలువ కిడుమను ♦ [1]నుదురున విడుచు
నాతండు రాజస♦త్యాగంబు చలిపి
త్యాగఫలంబును ♦ నందఁగా లేఁడె ౮
కార్యమే యనుచుఁ ద్య♦క్త ఫలసంగ మయి
నియతకర్మం బెది ♦ నెఱవేర్పఁ బడెడుఁ
ద్యాగంబు సాత్త్వికం ♦ బది యని మతము. ౯
సత్త్వయుక్తుఁడు ఛిన్న ♦ సంశయుఁడు నయి
త్యాగియు మేధావి ♦ యగువాఁడు వాసి
యగు కర్మమున సక్తి ♦ నందఁడు వాసి
కాని కర్మమున నం♦గదయుఁ గొనండు. ౧౦
తుదముట్టఁ గర్మముల్ ♦ దొలఁగంగరాదు
గా! దేహికి నెవఁడు ♦ కర్మఫలంబు
ద్యజియించు నాతండు ♦ త్యాగి నాఁ బరఁగు. ౧౧
అత్యాగులకు మర♦ణానంతరంబు
నిష్టంబు మిశ్రం బ♦నిష్టంబు నాఁగఁ
గలదు ముత్తెఱఁగులఁ ♦ గర్మఫలంబు
సన్న్యాసులకునా పొ♦సఁగ దెప్పు డేని. ౧౨
సాంఖ్యసిద్ధాంతంబు ♦ చాటెడు నన్ని
కఱతల సిద్ధికి ♦ కారణంబులను
నేనింటి బలశాలి ♦ యెఱుఁగునా వలన. ౧౩
కర్త, వేర్వేఱగు ♦ కరణముం, దనువు,

1. ఉదుర = భయము.

వివిధంబు లైనవి ♦ వేర్వేఱు లైన
కృత్యముల్, దైవంబె ♦ యేనవ దండు. ౧౪
న్యాయ్యమేని గాదేని ♦ నరుఁడు కర్మ మది
వాఙ్మన స్తనువుల ♦ వలనఁ దొడంగు
ని యైదు దానికి ♦ హేతువు లగును, ౧౫
ఇట్లిది యుండఁగా ♦ నెవఁడు కేవలము
తననె కర్తను గాఁగఁ ♦ దలఁచెడుఁ గుమతి,
మెఱుఁగిద్ద బుద్ధి లే♦మిని వాఁడు కనఁడు, ౧౬
కలుగ దెవ్వని కహం♦కార భావంబు
కలుగదో యెవ్వాని ♦ [1]కఱదకుఁ [2]గసటు
నీ లోకులను జంపె ♦ నేనియు వాఁడు
కాడు చంపినవాఁడు ♦ కాఁడు బద్ధుండు. ౧౭
జ్ఞానంబునుం బరి♦జ్ఞాత జ్ఞేయంబు
ననఁ గర్మచోదన ♦ మగు ముత్తెఱంగు,
కరణంబు కర్మము ♦ కర్తయును ననఁ
గా మూడు విధములు ♦ కర్మసంగ్రహము. ౧౮
గుణశాస్త్ర మందున ♦ గుణభేదములను
గని కర్త జ్ఞానము ♦ కర్మమును నని
ముత్తెఱంగులనె చె♦ప్పుదు రాలకింపు
వానిఁ గూడను సున్న♦వాని నున్నట్లు. ౧౯
నిఖిలభూతంబుల ♦ భిన్నంబు లందు
నవిభక్త మేకంబు ♦ నవ్యయం బైన

1. కఱది = బుద్ధి.    2. కసటు = మాలిన్యము.

భావంబు నెఱుఁగగా ♦ బడు దేన నట్టి
జ్ఞానంబు నగు సాత్త్వి♦కం బని యెఱుఁగు ౨౦
నిఖిలభూతంబులఁ ♦ భిన్నత్వమునను
వివిధభావములుగ ♦ వేర్వేఱుగఁ గను
జ్ఞానంబు నది రాజ♦సం బని యెఱుఁగు. ౨౧
ఏక కార్యమునందుఁ ♦ గృత్స్నంబు గాను
సక్తంబు నల్పం బ♦సత్యార్థ మైన
యది యహేతుక మది ♦ యంద్రు తామసము. ౨౨
ఫలము గోరని యట్టి ♦ వానిచే నేది
రాగసంగద్వేష ♦ రహితంబు గాను
నెఱవేర్పఁ బడునట్టి ♦ నియతకర్మంబు
నయ్యది సాత్త్వికం ♦ బైనది యంద్రు. ౨౩
కామంబునం గోర్కె ♦ గలయట్టి వాఁడు
గాన యహంకృతి ♦ గలవాఁడు గాని
యైనను బహులప్ర♦యాసంబు తోడఁ
జల్పు కర్మము రాజ♦సంబని యంద్రు. ౨౪
*అనుబంధ హింసాక్ష♦యంబులను మఱి
పౌరుషంబును గాని ♦ పరికింపకుండ
మోహంబువలనను ♦ మొనయఁ బడు నేది
దానిని నందురు ♦ తామసం బనుచు. ౨౫
త్యక్తసంగుఁడు నన♦హంవాది ధృతియు
నుత్సాహములతోడ ♦ నుండు నాతండు
సిద్ధ్యసిద్ధులమార్పుఁ ♦ జెందని వాఁడు

* అనవేక్ష్య చ పౌరుషం. పా. అనపేక్ష్య చ పౌరుషం.

నగుకర్త సాత్త్వికుం ♦ డనఁ గనుబరగు. ౨౬
కర్మఫలాపేక్ష ♦ కలవాఁడు రాగి
హర్షశోకాన్వితుం ♦ డశుచి లుబ్ధుండు
హింసాత్మకుండు న♦గు నట్టి కర్త
రాజసుం డనఁగను ♦ బ్రచురింపఁ బడెను. ౨౭
స్తబ్ధుం డయుక్తుండు ♦ శఠుండు ప్రాకృతుండు
దీర్ఘసూత్రుఁడు విషా♦దియు *నైకృతికుఁడు
నలసుఁ డౌ కర్తను ♦ నంద్రు తామసుఁడు. ౨౮
పార్థ గుణంబులం ♦ బట్టి ముత్తెఱఁగు
పొసఁగెడు ధృతియొక్క ♦ బుద్ధియొక్కయును
భేదం బశేషంబు ♦ వేర్వేఱుగానుఁ
జెప్పఁ బోయెడు దానిఁ ♦ జెవిఁ బెట్టుకొనుము. ౨౯
బంధమోక్షంబులన్ ♦ భయ మభయముల
వృత్తి నివృత్తుల ♦ విజయుఁడ, యేది
కార్యం బకార్యంబు ♦ కనుగొని యెఱుఁగొ
యాబుద్ధి సాత్త్వికం ♦ బై పట్టి దగును. ౩౦
కాంచుఁ గార్యంబు న♦కార్యంబు మఱియు
ధర్మంబు మఱియు న♦ధర్మంబుఁ గూడ
నున్న దున్నట్లుఁ గా♦కుండఁగాఁ దేవ
నా బుద్ధి యర్జునా ♦ యగు రాజసంబు
తలఁచు నధర్మంబు ♦ ధర్మంబు నాఁగ
నజ్ఞానమున మున్గి ♦ యఖిలార్థములను
దరిసించును విపరీ♦తములుగా నేది

---

* పా. నైష్కృతికుడు.

యాబుద్ధి యర్జునా, ♦ యగుఁ దామసంబు ౩౨
తొలఁగని యోగంబు♦తో ధరియింప
నగు మనఃప్రాణేంద్రి ♦ యక్రియల్ దేన
నల ధృతి పార్థుఁడ, ♦ యగు సాత్త్వికంబు. ౩౩
సంగంబునను ఫలా♦శ గల వాఁడగుచు
ధర్మ కామార్థముల్ ♦ ధరియించు దేన
నల ధృతియును బార్థ ♦ యగు రాజసంబు. ౩౪
స్వప్నంబు భయము వి♦షాదంబు మదముఁ
[1]దెగఁడె శోకంబునుం ♦ దేనఁ గుబుద్ధి
యలధృతి యర్జునా, ♦ యగుఁ దామసంబు. ౩౫
ముత్తెఱంగుల సుఖ♦మును నిప్పు డీవు
భరతర్షభ, విను నా ♦ వలన, దేన నగు
నభ్యాసమున సుఖ ♦ మడఁగు దుఃఖంబు. ౩౬
అయ్యెడు నెయ్యది ♦ యాదిని విషము
నట్టులఁ దుదియందు ♦ నమృతంబు నట్లు,
చను నాత్మబుద్ధిప్ర♦సాదజ మగుచు
నల్ల సుఖంబును ♦ నంద్రు సాత్త్వికము. ౩౭
అయ్యెడు విషయేంద్రి♦యముల కలయిక
వలనను నమృతంబు ♦ పగిదిని మున్ను
నంతమందున విషం ♦ బ ట్లెద్ది యల్ల
సుఖము రాజసము నం♦చుఁ దలంపఁబడును. ౩౮
మునుపును దుదియందు ♦ మోహంబు నాత్మ

1. తెగఁడె = ఊడఁడే.

సలముఁ, బ్రమాద ని♦ద్రాలస్యములను
బుట్టిన యట్టి ద♦గు నల సుఖంబు
తామసం బనుచు ను♦దాహృతం బగును. ౩౯

ఈ ప్రకృతిజము ల♦యిన త్రిగుణముల
వలన ముక్త మగు స♦త్త్వం బేది లేదు
భువియందు దివిని దే♦వుల యందె కాని. ౪౦

బ్రాహ్మణ క్షత్రియ ♦ వైశ్య శూద్రులకుఁ
గర్మంబులును విభ♦క్తంబు లైన యవి
సవ్యసాచి, స్వభావ♦జ గుణము లంటి. ౪౧

శమమును దమమును ♦ శౌచంబు తపము
క్షాంతి విజ్ఞానంబు ♦ జ్ఞాన మాస్తికత
యార్జవంబును నను♦నట్టి కర్మములె
బ్రాహ్మణులకును స్వ♦భావజంబు లగు. ౪౨

తేజంబు శౌర్యంబు ♦ ధృతియు దాక్ష్యంబు
పోర నోడమి దాన♦మును నీశతయును
క్షత్త్రియుల స్వభావ ♦ జాతకర్మములుఁ ౪౩

వైశ్యునకు నగును ♦ వాణిజ్యము కృషి
పసులఁ బ్రోచుట స్వ♦భావజపుఁ గర్మంబు
గాఁ, బరిచర్యాత్మ♦క మగు కర్మంబు
నగు స్వభావజము నా ♦ నది శూద్రునకును. ౪౪

తన తన కర్మముఁ ♦ దవిలిన నరుఁడు
కాంచు సిద్ధిని, నిజ ♦ కర్మనిరతుఁడు
విను మెట్లు సిద్ధిని ♦ బొరయును దాని. ౪౫

ప్రభవించు నెవ్వాని ♦ వలన భూతములు
నెవ్వానిచే వ్యాప్త ♦ మీ యఖిలంబు
వానిన్ స్వకర్మంబు ♦ వలన నరుండు
నర్చించి సిద్ధిని ♦ నందెడి వాఁడు. ౪౬

తనరఁ జల్పిన పర♦ధర్మంబు కన్న
స్వీయధర్మము మేలు ♦ విగుణమేన్ గలుగ
దఘము స్వభావని♦యతకర్మముఁ గొన. ౪౭

సకలుషం బేనియున్ ♦ సహజకర్మంబు
రాదు విడువఁగ; నా ♦ రంభంబులెల్ల
నగ్ని ధూమంబుచే ♦ నట్టులఁ గాదె
దోషంబు నందునఁ ♦ దోఁగి యున్నయవి. ౪౮

స్పృహ లేని వాఁడ, న్ని ♦ కెడ నసక్తుఁ డగు
వాఁడు, జితాత్ముండు, ♦ పరమంబు నైన
నైష్కర్మ్యసిద్ధి స♦న్న్యాసమునఁ గను. ౪౯

కౌంతేయ సిద్ధుండు ♦ జ్ఞానంబునకును
బరమఫలంబైన ♦ బ్రహ్మంబు నెట్లు
కాంచు సంక్షేపంబుఁ♦గఁ గను నా వలన. ౫౦

పరిశుద్ధ మా బుద్ధి ♦ వహియించి, యాత్మ
ధృతివలనను నిల్పి, ♦ ద్వేషరాగముల
విడిచి, శబ్దాదు లా ♦ విషయముల్ గడచి. ౫౧

ఏకాంతభూమి వ♦సించు వాఁ డగుచు,
యతవాఙ్మనఃకాయుఁ♦డై మితభుక్కు-
నగు వాఁడు, ధ్యానయో♦గాసక్తుఁ డెపుడు

నగు వాఁడు, కామం బ♦హంకారములను
దర్పంబు బలము క్రో♦ధము, పరిగ్రహము
తొలఁచిన యతఁడు, శాం♦తుఁడు, నిర్మముఁడు,
వైరాగ్యమును లెస్స ♦ పట్టిన వాఁడు,
నగు వాఁడు, బ్రహ్మంబు ♦ నందఁగాఁ గలఁడు.
అయి బ్రహ్మభూతుఁడు ♦ నై ప్రసన్నాత్మ
కలవాఁడు, కొనఁడు శో♦కంబును గాంక్ష,
సర్వభూతంబుల ♦ సముఁడయి, కలఁడు
పరమ మా నాయెడ ♦ భక్తిని బడయ. ౫౩, ౫౪
ఎట్టి వాఁడను నాదు ♦ నెవ్వాఁడ నేను
భక్తి న న్నెఱుఁగుఁ ద♦త్త్వముగ నవ్వలను,
నను దత్త్వముగఁ గాంచి ♦ నను జొచ్చునంత. ౫౫
కర్మంబు లన్నియుం ♦ గావించు చెపుడు,
నాశ్రయించిన వాఁడు ♦ నై కడు నన్ను,
స్థిరమైన కొఱలేని ♦ సీమను నాది
యగు ప్రసాదంబుచే ♦ నందఁగాఁ గలఁడు. ౫౬
బుద్ధియోగంబు ప్రా♦పు నధిగమించి
మానసంబునను గ♦ర్మంబుల నెల్ల
వదలి నాయందు, మ♦త్పరుఁడవు నగుచుఁ
జిత్తంబు నాయందుఁ ♦ జేర్పు మెల్లప్పుడు. ౫౭
మచ్చిత్తుఁడవు నయి ♦ మత్ప్రసాదమునఁ
గలవు దాఁటంగ స♦కల దుర్గమముల,
హంకారమున విన♦వైనఁ జెడెదవు. ౫౮
హంకారమూని పో♦రాడను నంచు

నెంతు వేని సీదగు ♦ నీ నిశ్చయంబు
వ్యర్థ మౌ నది, నిన్ను ♦ బ్రకృతి నేమించు. ౫౯
బద్ధుండ వయి, నీ స్వ♦భావజం బైన
కర్మంబుచేతను, ♦ గావింపఁగాను
వలవ వేని మోహంబు ♦ వలనను, నద్ది
పార్థ, కావింతు వ♦వశుఁ డవు నయియు. ౬౦
యంత్రమం దట్లున్న ♦ యఖిలభూతముల
నడుపుచు మాయచే ♦ నర యుండు విభుఁడు
నెల్ల భూతంబుల ♦ హృద్దేశ మందు. ౬౧
వానినే సర్వభా♦వంబునఁ బార్థ,
దరిచేరు తత్ప్రసా♦దమున శ్రేష్ఠ మగు
శాంతియు శాశ్వత ♦ స్థానమొందెదవు. ౬౨
గుహ్యంబు లందును ♦ గుహ్యతరంపు
జ్ఞానంబు నీకు నేఁ ♦ గఱపితి నిటుల
నియ్యది తుదముట్ట ♦ నెన్నిక చేసి
యిష్టమయిన విధం ♦ బెది యట్లు సలుపు. ౬౩
ఈవు నా [1]కిరవైన ♦ యిష్టుండ వగుట
నీకు హితంబు వి♦నిచెదను మరల
నన్నింటిలోన గు♦హ్యతమంబు నైన
పరమంబు నైన నా ♦ వచనంబు వినుము. ౬౪
నను గొల్చు వాఁడవు, ♦ నా భక్తుఁడ వగు
మెద నన్నుఁ గలవాఁడ, ♦ వెఱఁగుము నాకు,

1. ఇరవు = స్థిరము.

నన్నె ప్రాపించెదు, నాకుఁ బ్రియుఁడవు
నీవు; సత్యము, నీకు నిచ్చెద మాట. ౬౫

సర్వధర్మంబులం జాలించి నన్నె
శరణొందు మొకనినే, సకలపాపముల
వలన ని [1]న్నురలింతుఁ, బనిలేదు వగవ. ౬౬

ఇయ్యది నీ కగు, నెప్పు డేనియును
భక్తిహీనున కతపస్కున కేని
గాని శుశ్రూషను గావింప నట్టి
వానికి నేనియు వచియింప రాదు. ౬౭

అధికంబును రహస్య మా దీని నాదు
భక్తుల కెవ్వఁడు వచియించు వాఁడు
పరమ మా భక్తి నా పైనఁ గావించి
నన్నె ప్రాపించు సంశయమును లేదు. ౬౮

నరులందు వానికన్నను నెచ్చు ప్రియము
కొలుపు నాతండు నాకు నెవ్వఁడు లేఁడు
అతనికన్నఁ బ్రియతరుండు నాకు
భువిలోనఁ గలుగఁగాఁ బోవఁడు గూడ. ౬౯

మనది యీ ధర్మ్యసంవాదంబు నెవఁడు
చదువును వానిచే జ్ఞాన యజ్ఞమున
నేను [2]నిష్టము నాచరింపఁగాఁ బడిన
వాఁడ నౌదును నాదు భావ మిట్టియది. ౭౦

1 ఉరలు = వీడు. 2. ఇష్టము = యజ్ఞకర్మము.

ఎవ్వాఁ డసూయార♦హితుఁడు శ్రద్ధగల
వాఁడై విను నతఁడుం ♦ బడయు ముక్తుఁడయి
పుణ్యకర్ములవి యు♦వు శుభలోకముల. ౭౧
ఏకాగ్రచిత్తంబు ♦ నెనసి నీచేత
నిది విశ్రుతం బాయె ♦ నే పార్థ, నీదు
నజ్ఞాన సమ్మోహ ♦ మడఁగెనే విజయ. ౭౨

అర్జునుండు పల్కె.

నీప్రసాదంబున ♦ న్దెలివిని గాంచి,
నిలిచితి వీడి స♦న్దియము, మోహంబు
వదలెఁ గావింతు నీ ♦ వచనంబు నేను. ౭౩

సంజయుఁడు పల్కె.

ఆలించితి మహాత్ముఁ ♦ డైన పార్థునియు
వాసుదేవునియు సం♦వాద మి దిట్లు
నద్భుతంబును రోమ♦హర్షణంబుగను. ౭౪
కృష్ణుండు యోగేశుఁ ♦ డీ గుహ్యతమము
పరమ మా యోగంబుఁ ♦ బ్రత్యక్షముగను
వచియింపఁ దాఁ వింటి ♦ వ్యాసుని దయను. ౭౫
అద్భుతంబును బుణ్య ♦ మా కేశవు నిది
నరుని యీ ముచ్చట♦న్దలఁచి తలంచి
పొరిఁ బొరి రాజ, స♦మ్మోద మందెదను. ౭౬
అత్యద్భుతం బైన ♦ హరిది యారూపుఁ
దలఁచి తలంచి యు♦దనము విస్మయము
నగు నాకు మఱి మఱి ♦ యలరుదు రాజ. ౭౭

ఎచట యోగేశుఁడౌ కృష్ణుండు నెచట
వింటిని బూనిన విజయుండు నుండు
నచట శ్రీయును విజయము భూతి నీతి
దృఢముగా నుండెడి నిది నాదు మతము. ౭౮

ఇది

శ్రీవెలమకులశేఖర మట్నూర్తిగోత్రపయఃపారావార
సుధాకర పానగంటి వంశతిలక వేంకటరంగధాత్రీ
కళత్ర పుత్త్రి, బుధజనవిధేయ, పార్థసారథి
రాయాభిధేయ ప్రణీతంబైన
శ్రీభగవద్గీతామంజరి
సమాప్తము.

# శ్రీ భగవద్ గీతామంజరి తప్పొప్పుల పట్టిక

| అధ్యా | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౬ | ఘనవరు లెవరో... | ఘనులు వెవ్వారో |
| ౨ | ౫ | ఆచరింపగఁజే... | ఆచరింపంగఁజేయ... |
| ౬ | ౩ | నరుఁడు నెవ్వండో... | నడుమ నెవ్వండో |
| ౪ | ౫ | మోపఁగా | మోవఁగా |
| ,, | ౨౭ | నను | నన్ను |
| ౭ | ౪ | పో | బోరు |
| ౯ | ౫ | రు | దు |
| ,, | ౭ | అస్వతంత్ర...ముల ప్రతతి......ముగ | ప్రకృతివశమ్మున స్వాతంత్ర్య హీనమయిన యీ యఖిల భూతాళిఁబొరిఁబొరిఁ |
| ,, | ౧౦ | బ | ప, |
| ౧౦ | ౭ | చూ | గూ, |
| ,, | ౩౬ | శు | ను. |
| ౧౧ | ౪౦ | వతి. | నతి |
| ౧౨ | ౩ | వాఁడు | వారు |
| ౧౩ | ౩౨ | గుణరహితమనా | గుణరహితుఁడనా |
| ౧౩ | ౩౨ | వొందదు సోఁకు | దొందఁడు సోఁకు |
| ,, | ౩౩ | సర్వగతంబయ్యు | సర్వగతుండయ్యు |
| ,, | ,, | రాదొ | రాఁడొ |
| ,, | ,, | వటులె | నట్టిఁడె |
| ,, | ,, | నాత్మరాముతుడు | నాత్ముఁడు |
| ౧౪ | ౪ | నీవు | నవు |
| ,, | ౯ | అ | న |
| ౧౭ | ౬౪ | భక్తిహీను...కేని గాని శుశ్రూ...నట్టి | భక్తిహీను......కేని నన్ను ననూయయొనర్చు వాని కినిగాని శుశ్రూషను... |